కవితా సంకలనం

# అనుభూతి

దేశికవిత్వ ప్రచురణలు



# అనుభూతి

యువభారతీయుల

రజతోత్సవ కవితా సంపుటి

సంపాదకులు :

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

రజతోత్సవ ప్రచురణ

ప్రచురణ :

యువభారతి రజతోత్సవ సంఘం

యువభారతి కార్యాలయం

ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనాలు,

తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001

ANUBHOOTHI : An Anthology of poems written by the members of Yuva Bharathi Published on the occasion of Silver Jubilee Celebrations.

Editors :

Dr. G.V. Subrahmanyam & Dr. T. Srinivasacharya

© Yuva Bharathi

Yuva Bharathi Silver Jubilee Publication No. 141

First Edition : June 1992

Copies : 1000

**Price : Rs. 20/-**

Cover Design : Sri Seela Veerraju

Published by :

**Yuva Bharathi**

Silver Jubilee Celebrations Committee,

Hyderabad-500 001.

For Copies :

**Yuva Bharathi**

(A Literary & Cultural Organisation)

Andhra Saraswatha Parishath Buildings,

Tilak Road, Hyderabad-500 001

Printed at :

**Padmavathi Art Printers**

1-1-517/B/1,

New Bakaram, Gandhi nagar,

Hyderabad - 500 380.

Phone : 611413.

# యువభారతి రజతోత్సవ సాహితి

రాజకీయ చైతన్యానికి అతీతంగా ఉండగలిగే విశ్వజనీనమైన సాహిత్య స్పృహను సమాజంలో జాగృతం చేసి తెలుగు సాహిత్యాభిమానాన్ని ఇంటింటా జ్యోతిలా వెలిగించాలనే లక్ష్యంతో యువభారతి ఇరవై యేడేళ్ళకు పైగా ఉద్యమాన్ని సాగిస్తున్నది. ఉత్తమ సాహిత్యం పుట్టటంతోనే చాలదు. దానిని ప్రజల దగ్గరికి తీసుకొనిపోయే ప్రయత్నం జరగాలి. పొలం దున్నే రైతులు, రాట్నం తిప్పే పల్లెటూరి పడతులు, మధ్యతరగతి మహిళలు, ఫ్యాక్టరీ కూలీలు, ఉద్యోగులు, ఉద్యోగినులు, యువతీ యువకులు, ఇలా చదువుకున్న ప్రతివారూ తెలుగు సాహిత్యంలో వెలువడిన - అంటే వారి మాతృభాషలో వెలువడిన - సాహిత్యం చదవాలి. లేదా కనీసం ఆ సాహిత్యాన్ని గురించి పరిచయమన్నా చేసుకోవాలి. అప్పుడే తెలుగు సాహితి సమాజంలో సజీవంగా ప్రవహించటానికి వీలుంటుంది. ఒక జాతిలో రచయితలు పుట్టటం ఎంత గొప్పో, సహృదయులు అధిక శాతంలో అభివృద్ధి చెందటం కూడా అంతే గొప్ప. సహృదయ లోకాన్ని, సాహితీ వాతావరణాన్ని సమాజంలో కల్పించటంలో సాహితీ సంస్థల పాత్ర విశేషంగా ఉంటుంది.

ఆ బాధ్యతను గుర్తించి, చుట్టూ ఆవరించుకొని వున్న చీకట్లను తిట్టుకుంటూ కూర్చోవటంకంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిదనే సూక్తి ఊపిరిగా యువభారతి ఇన్నాళ్ళుగా సాహిత్యోద్యమాన్ని సాగిస్తున్నది. సామాన్య జనులు కూడా మహాకవుల రచనలలోని మాధుర్యాన్ని, తాత్పర్యాన్ని, సందేశాన్ని, శిల్ప సౌందర్యాన్ని తెలుసుకునేటట్లు ఉపన్యాసాల ద్వారా, కవితా వైభవాల (కవితలకు సరళ వ్యాఖ్యల) ద్వారా యువభారతి ప్రత్యేక ప్రయోగాలు నిర్వహించింది. లహరి ఉపన్యాసాలు, కవితా వైభవాలు, మందార మకరందాలు, వేమన వేదం లాంటి గ్రంథాలు ఇందుకు సాక్ష్యాలు. ప్రత్యేకించి యువతకు ఈ ప్రచురణలు కరదీపికలుగా పనికి వస్తున్నాయి. ప్రజాదరణం పొందాయి.

విద్యార్థులకు, విద్వాంసులకు పనికివచ్చే చర్చాగోష్ఠులను నిర్వహించి, చదువుకున్న వారిలో ఆలోచనలు రేకెత్తింప చేసే సారస్వతాన్ని సమాజానికి అందించే ప్రయత్నం చేస్తోంది యువభారతి. రచన, మహతి, ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం, పాతికేళ్ల పత్రికారచన, తెలుగుకవిత : లయాత్మకత- ఇలాంటి గ్రంథాలు పండితుల మన్ననలను అందుకున్నాయి.

యువతకు సాహిత్యాన్ని నవ్య ప్రయోగాలతో నవనీతంలా అందించే ఉద్యమానికి యువభారతి ప్రతీక అనే భావం ప్రజలలో ఒక అనుభూతిగా ఆవిష్కరించుకో గలిగింది ఈ సంస్థ! యువభారతి ఉద్యమంలో పాలుపంచుకుంటూ ఎన్నో రకాలుగా ప్రోత్సహిస్తున్న యువభారతీయులు కొందరు కలిసి అప్పుడప్పుడూ కవితా సంపుటాలను ప్రచురించుకోవటం పరిపాటి.

ఆ వరుసలో 'అనుభూతి' ఒక మైలురాయి. రజతోత్సవాల సందర్భంగా వెలువడుతున్న ఈ సంపుటికి ఒక ప్రత్యేకమైన విలువ ఉంటుంది. అజంతా గుహల్లో అపూర్వ చిత్రాలను చిత్రించిన వారిలో పరిణతులూ ఉన్నారు. సాధకులూ ఉన్నారు. అలాగే ఈ కవితా సంపుటిలో కూడా. యువభారతి అన్ని రకాల భావాల వారినీ గౌరవిస్తుంది. ఏ భావాలుగానీ, ఏ భావజాలంగానీ కవితలో చెప్పినప్పుడు అది కళానుభూతిని అందించగలిగితేనే కవిత కాగలదని యువభారతి విశ్వసిస్తుంది. కళానుభూతికోసం కలాలు పట్టిన గళాల బృంద గీతం ఈ 'అనుభూతి'ని సహృదయులకు అందిస్తున్నాం.

యువభారతి రజతోత్సవాలలో 1992 జూన్ 1 వ తేదీనాడు జరిగిన కవి సమ్మేళనంలో కవిమిత్రుల చదివిన కవితలు కూడా ఇందులో కొన్ని చోటుచేసుకొన్నాయి. భారతీమిత్రులు, భారతీభూషణులు, రజతోత్సవ సభ్యులు వంటి సభ్యుల రచనలు ఇందులో కూర్చబడ్డాయి. రజతోత్సవ సంఘ సభ్యులు కొందరు తమ రచనలను పంపి ఈ అనుభూతిలో పాలు పంచుకున్నారు.

ఇందులో పాల్గొన్న కవులందరికీ, ముఖపత్ర శిల్పి శ్రీ శీలా వీర్రాజు గారికీ, ముద్రాపకులు పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్‌కీ, ఎన్నోరకాల సహాయం చేసిన ఎందరో మనస్వులకూ మా నమస్సులు.

హైదరాబాదు.
2 6-1992

జి. వి. సుబ్రహ్మణ్యం
యువభారతి అధ్యక్షుడు

## 'అనుభూతి'లో కవితలు....


1. డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి - నదిని హత్య చేయకండి 1

2. 'వాస్తుశిల్పి' బి. ఎన్. రెడ్డి - బి. ఎన్. భాషితాలు 5

3. 'సహజకవి' మల్లెమాల - చైతన్యదీపాలు 7

4. డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్య - శాంతివిలాసం 10

5. డాక్టర్ నాగినేని భాస్కరరావు - నేటి భారతంలో దీపావళి 11

6. డాక్టర్ వాసా ప్రభావతి - మనిషి 14

7. ప్రాతూరి శ్రీనివాస్ - కొత్తగాలి 18

8. డి.ఎ.ఎల్.ఎన్. మూర్తి - తెలుగులో అవధానములు 19

9. దీవి శ్రీనివాసమూర్తి - భావమందారాలు 22

10. కె. నాగేంద్రాచారి - కవిత్వం, నిత్యసత్యాలు 26

11. సస్యశ్రీ - ప్రజల మధ్యకు, మడతవద్ద మగ్గాలు, దేశభక్తి గీతం, ఎడారి పువ్వులు, మొలకనవ్వు 28

12. ఊట్ల కొండయ్య - 'యుగయుగమ్ముల భారతీయుడను నేను' 33

13. డాక్టర్ వి. వి. యల్. నరసింహారావు - ప్రబుద్ధ యువభారతం 36

| | | | |
|---|---|---|---|
| 14. | కె. వెంకట శివయ్య | - అన్వేషణ-నివేదన-ఆత్మాహుతి | 37 |
| 15. | డాక్టర్ కొండలరావు, వెలిచాల | - శుభాకాంక్షలు | 39 |
| 16. | డాక్టర్ ఎన్. గోపి | - సముద్రమే నేపథ్యంగా | 41 |
| 17. | డాక్టర్ నాగినేని భాస్కరరావు | - రూపాయి పాపాయి | 43 |
| 18. | డాక్టర్ అంతటి నరసింహం | - ఏం వ్రాయను తమ్ముడూ! | 44 |
| 19. | డాక్టర్ ముక్తేవి భారతి | - ఊయల | 47 |
| 20. | డాక్టర్ ఎల్లూరి శివారెడ్డి | - పాపం దారి! | 51 |
| 21. | డి. ఎ. ఎల్. ఎన్. మూర్తి | - ప్రొద్దున్నే పేపరు | 52 |
| 22. | హరి చంద్రశేఖర్ | - సంతప్తాంతరంగాన్నై.... | 54 |
| 23. | జి కుమారస్వామినాయుడు | - అద్దం, విషాద విషయ సందోహాలు | 56 |
| 24. | చొప్పకట్ల చంద్రమౌళి | - జండా విలవిలకొట్టుకుంటోంది | 58 |
| 25. | రఘుశ్రీ | - (అ)రెస్ట్ | 59 |
| 26. | శివపురం శైలజ | - ఈకాలం కవి | 60 |
| 27. | చిల్లర భవానీదేవి | - వజ్రపుష్పం | 62 |
| 28. | డాక్టర్ వడ్లూరి ఆంజనేయులు | - ప్రతిజ్ఞ | 63 |
| 29. | గంటి లక్ష్మీనారాయణమూర్తి | - వెండి వెలుగులు | 64 |

| | | | |
|---|---|---|---|
| 30. | నాయికోటి శివప్రసాద్ | - పరివర్తనోగాది, నిరీక్షణ, పట్టాలపై ప్రాణి, వినూత్నోగాది | 65 |
| 31. | కె. శ్యాంప్రసాదరావు | - నరమేధం. బాల్యం శాపమా, ఎడారి రోదన, ప్రార్థన, ధ్యానముద్ర | 69 |
| 32. | జీడిగుంట సాయిబాబా | - ఆకారం శ్రీకారం, అగష్టు పదిహేను, సూర్యుడా ఉదయించు, ఏముందని, అన్వేషణ | 73 |
| 33. | గన్నమరాజు సాయిబాబా | - పొదుపు, అందాల సుందరి, పాలు. జీతంలేని జీవితం | 77 |
| 34. | బి. వసుంధర | - దీపలక్ష్మి | 81 |
| 35. | దీవి రంగాచార్యులు | - కాలం, స్వీయ స్వగతాలు, మేలుకొలుపు, శంఖారావం, దివ్యహారతి | 85 |
| 36. | సాలగ్రామ్ | - పద్మవ్యూహంలో జీవనవాదం, పుస్తకం, ఫిజిసిస్టు ప్రేమగీతం | 90 |
| 37. | ములకల బాలాజీప్రసాద్ | - చేనేత చైతన్యం | 96 |
| 38. | కొరుప్రోలు మాధవరావు | - కళ్ళుమూస్తే వెన్నెల, శ్రమామృతం, అవ్యక్తపాశం, మృత్యుశకలం | 98 |
| 39. | డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం | - మినీ కవితలు | 101 |
| 40. | వి. నాగరత్నకుమారి | - ఆశాభంగం, దర్శనభాగ్యం, నీకే తెలియాలి, ఘనుడు, బధిరుడు, అపశ్రుతి | 103 |

| | | | |
|---|---|---|---|
| 41. | కొప్పెర్ల మద్దయ్య | - నీకేమున్నది?, ఎవరయ్యా ముందుకు వచ్చేవారు?, ఇదే-[నా]లోకం?, సంఘీభావం పెరగాలి, ఇదేనా ప్రగతి | 107 |
| 42. | పి. సంగారెడ్డి | - రోజూ తప్పక దండం పెడతా, లక్ష్యం - సాధన | 111 |
| 43. | జి. సరోజదేవసాయం | - సందేశం,డాక్టర్,ఐకమత్యం, యుద్ధభయం, కనువిప్పు | 115 |
| 44. | యం. మహంతయ్య | - మిత్ర సందేశం, ఏది మిన్న, అంటనివాళ్ళు, రాష్ట్రావతరణం, స్వాతంత్ర్యమా నీవెక్కడ? | 119 |
| 45. | దర్పణం (ఎన్. బి. శాస్త్రి) | - కానుక, ఫార్ములా, పాణి గ్రహణమా నీకు వీడ్కోలు, రాంగ్ నంబర్, స్వేచ్ఛాభిక్ష, వైద్యం నేర్పించు | 124 |
| 46. | సి. కామేశ్వరరావు | - విషాదంలో విరులు, పరిభ్ర మణం, చైతన్యసుధ, దిగులు | 128 |
| 47. | బత్తిని విఠల్ | - మానవతా! నీ అడ్రసు ఎక్కడ, వెళ్ళిపో నేస్తం వెళ్ళిపో, సామాన్యునిసణుగులు | 133 |
| 48. | డాక్టర్ వి. సంపత్కుమా రాచార్య | - మంగళ నమస్కారము, మంగళగీతము, మంగళప్రభ | 139 |
| 49. | ఎం. బసవయ్య | - శుభాశంస | 143 |
| 50. | డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం | - "ఆంధ్రజనతకు నవతకు అంకితమ్ము" | 144 |

డా॥ ఉండేల మాలకొండారెడ్డి

# నదిని హత్యా చేయకండి

మబ్బుతల్లి ఒడినుండి
మట్టిమీద జారిపడ్డ
వాన చినుకులే యీ నది.

కొండరాళ్ళ ఢీ కొట్టి
గుండె పగులగొట్టుకొన్న
వర్షాశ్రువులే యీ నది.

ఏ కడలినుండి తాను
ఎండకు ఆవిరిగా మారి
ఆకాశం చేరెనో
ఆ కడలినే చేరాలనే
ఆరాటం మిక్కుటమై
చిక్కకుండ పరుగెత్తే
చిన్నారి బాల యీ నది.

కొండనుండి కడలిదాక
కోనల కానల నడుమ
కూనిరాగాలు తీస్తూ
ఆగక సాగిపోయే
ఆనందజీవని యీ నది.

ఉన్నట్లే వుండి
ఉన్నత శిఖరంనుండి
అగాధంలో పడ్డా
అఖండ నృత్యం చేసే
అపూర్వ జలపాత సుందరి యీ నది.

ఒకచోట "గంగ"
ఇంకొకచోట "వోల్గా"
మరొకచోట "రైన్"
వేరొకచోట "అమెజాన్"
పేరులెన్ని మారినా
దారి మాత్రం ఒక్కటిగా
నీరధి గమ్యం చేరే
నిత్య చైతన్య వాహిని యీ నది.

నది వున్న చోటే
నాగరికత వుందన్న
నానుడి సాక్ష్యంగా
సమస్త ప్రాణుల్ని
చంకనిడుకొని
చనుబాలు కుడిపే
పచ్చిబాలెంత యీ నది.

ఆకాశరమణి రాల్చిన
ఆనందబాష్పధార యీ నది
చల్లని నేలతల్లి పిదికిన
స్తన్యధార యీ నది.

పారినంత మేరకు
పచ్చదనం కురిపిస్తూ
దూకినపుడు విద్యుత్
రేఖలు మొలిపిస్తుందీ నది.

శ్రమజీవుల చెమటముత్యాల్ని
కంఠహారంగా ధరిస్తుంది
అగ్రజాతి వాడైనా
అంటరాని వాడైనా
అభిషేకం చేసి
అకల్మషుల్ని చేస్తుందీ నది
పులుల్ని మేకల్ని ఒక్క రేవులో
నీళ్ళు తాగిస్తుందీ నది.

కాలుజారి పడ్డా
కావాలని పడ్డా
ప్రతి ప్రాణిని సమాదరంగా
పరిగ్రహిస్తుం దీ నది.
మునిగిపోయినవారిని బాధా
ముక్తుల్ని చేస్తుంది
మునిగితేలినవారిని ఆనంద
ముగ్ధుల్ని చేస్తుం దీ నది.
ఈ నదిలో - ఎందరు
ఎలనాగలు మహారాణులు
జలక్రీడ లాడినారో
ఎందరు బాటసారులు
దోసిళ్ళతో తమ దాహం తీర్చుకొన్నారో
ఎందరు ధీవరులు
వలలు విసరి చేపల్ని వేటాడారో
ఎందరు విప్లవవీరులు
కుత్తుకలు కోసిన కత్తుల
నెత్తుర్ని కడిగారో
ఎందరు అనాధలు
తమ పసుపు కుంకుమల్ని
గాజు మెట్టెల్ని
గంగలో కలుపుకొన్నారో
అన్నిటిని తనలో భరించి
అన్నెం పున్నెం ఎరుగని
అమాయకురాలిగా
అగుపిస్తుం దీ నది.
నిప్పులు గ్రక్కే ఎడారిలో
అగ్నిప్రవేశం చేసే సీతలా
ఆత్మధైర్యంతో
అడుగులు వేస్తుందీనది.

కొంకులు దూరని కారడవుల్లో
అడవిపూలు జడనిండా తురుముకొని
వయ్యారి వనకన్యలా
వంపులు సొంపులు తిరుగుతుం దీనది.

క్రిక్కిరిసిన నగరమధ్యంలో
ముక్కుమూసుకొన్న పాకీపిల్లలా
విసరేసిన ఎంగిలాకుల్ని
వీపుమీద మోస్తుం దీనది.

ఈ నా దేశం ఒక నది
ఎప్పుడూ ప్రవహించే జీవనది
మంచుకొండ గుండె కరిగి
మహీతలాన్ని ముంచెత్తే
మహా పవిత్రభాగీరథి.

ఈ నది యెదలో గునపాలు గ్రుచ్చకండి
చక్కని జీవనధారను ముక్కలు చేయకండి

ఈ నా దేహం ఒకనది - కదిలేగుండెల చప్పుళ్ళు
కలబోసుకొన్న కవోష్ణ రక్తఝరి

ఈ గుండెల్ని ఖండాలు చేయకండి
జీవరక్త ప్రవాహాన్ని చితిపై చిందించకండి.

'వాస్తుశిల్పి' బి. యస్. రెడ్డి

# బి. యస్. 'భాషితాలు

మంచీ - చెడుల కలయికయే మనిషి జీవితమ్మా
మంచిని తీసుకొమ్మా - చెడును వదులుకొమ్మా
అరటిపండు తొక్క తీసి - లోపలిపండు తిన్నట్లు
వడ్లమీది పొట్టు తీసి - బియ్యం వండుకున్నట్లు—

అధికారం - ఐశ్వర్యము అన్నీ వున్నవాడు
ఏమి చేసినా చెల్లుతుందనే అహంతో
గుఱ్ఱం బదులు గాడిద నెక్కితే
నడివీధిలో నడ్డివిరిగేలా పడ్డాడట -

పిల్లలు పుట్టకపోతే బాధ
పుట్టి చనిపోతే మరింత బాధ
పుట్టినవాడు సన్నాసైతే
చెప్పుకోలేనంత బాధ -

అందమైన ఆకర్షణ లెన్నో వున్న ప్రపంచంలో
మనకు నియమావళి అనే ఒక కళ్ళెం వుంటేనే
మన జీవితం సరియైన దారిలో నడుస్తుంది
కళ్ళకు గంతలు కట్టిన గుఱ్ఱంలా!

సీదాసాదాగా జీవించాలనే ఆశయంతో
పాదరక్షల్లేకుండా అడవిలో అడ్డంగా నడిచి
ఆరునెలలు ఆస్పత్రి పాలైనాడట ఓ ఆశ్రమవాసి
సాదా జీవితం అంటే సర్కసుకాదని వేరే చెప్పాలా?

మనిషికి మంచీ చెడూ అనే ఆలోచన లేకపోతే
నీతి - నియమం పాటించాలనే వివేకం లేకపోతే
కనిపించినదంతా కావాలనే ఆశ చావకపోతే
మనిషికీ - గొడ్డుకీ తేడా ఏముంది?

మంచి మనిషికి పబ్లిసిటీ అవసగం లేదు
ధైర్య సాహసాలున్నవాడికి దండోరా లవసరం లేదు
మృగరాజు అడవికి రాజని చాటడానికి
మందీ మార్బలం - బాజా భజంత్రీలు అవసరం లేదు.

కొన్ని జీవిత భాగస్వామికి చెప్పొద్దు
కొన్ని సంగతులు పిల్లలకు చెప్పొద్దు
కొన్ని స్నేహితులకు చెప్పొద్దు
అన్నీ అందరికి చెప్పొద్దు—

నీవద్ద పనిచేసే వాడికి
నెలనెలకు జీతమిస్తే
వాడి బాగోగులు కాస్త చూస్తే
మీరే దేవుడవుతారు వాడికి.

అపజయాలు రెండు రకాలు
ప్లాను వేయకుండానే పనులు చేసి
ఓడిపోయేవారు కొందరైతే
ప్లానతో కాలయాపన చేసేవారు కొందరు
నీవు ఎంత తొందరగా పని
చేశావనేది ముఖ్యం కాదు
ఆ పని ఎంత బాగా చేశావన్నది
అంతకంటే ముఖ్యం.

మనిషి సంపాదించిన దానిలో
కొంత దానం చేయక పోతే
అలుగు లేని చెరువు తెగినట్లు
ప్రమాదభరిత మాతని జీవితం.

సహజకవి 'మల్లెమాల'

# చైతన్య దీపాలు

చైతన్య దీపాలు పసిపిల్లలు
చిన్నారి మనసులకు లేవెల్లలు
పిల్లలుండే చోట-పిలువకనే పలికేటి
ప్రేమానురాగాలు కోకొల్లలు ||చైతన్య||

రూపుగొన్న సరదాలు పసిపిల్లలు
రేపటి తిథి వారాలు పసిపిల్లలు
తొలిపొద్దు వెలుగులా....
తెలి మబ్బు పరుగులా....
నులి వెచ్చని గిలిగింతలు
నింపుతారు పిల్లలు........
చైతన్యదీపాలు పసిపిల్లలు
చిన్నారి మనసులకు లేవెల్లలు||

*

పరిమళించు రతనాలు పసిపిల్లలు
పోరాడే శ్రుతిలయలు పసిపిల్లలు
పచ్చిపాల నురగల్లా....
పైరగాలి తరగల్లా....
పలురకాల హాయి మనకు
పంచుతారు పిల్లలు||....
చైతన్య దీపాలు పసిపిల్లలు
చిన్నారి మనసులకు లేవెల్లలు||

*

అమ్మ చేతి గోరుముద్ద
లెంతకమ్మనో....పిల్ల
లలవోకగ ఇచ్చు ముద్దు
లంతకమ్మన—
తేట తెనుగు మాటలా....సెల
యేటి అలల పాటలా
పిల్లలు అది పనిగచేయు
అల్లరి కడుకమ్మన॥—
చైతన్య దీపాలు పసిపిల్లలు
చిన్నారి మనసులకు లేవెల్లలు॥

*

అరవిరిసిన సిరిమల్లెలు
ఎంత అందమో—
ఆడుకొనే పసిపిల్లలు
అంత అందము—
నడయాడే నవ్వుల్లా
నర్తించే మువ్వల్లా
దిసమొలతో తిరుగాడే
పసిపిల్లలదే అందము॥
చైతన్య దీపాలు పసిపిల్లలు
చిన్నారి మనసులకు లేవెల్లలు॥

*

గుడికి వెళ్ళు పల్లెపడుచు
లెంత ముచ్చటో....
బడికి వెళ్ళు పిల్లకాయ
లంత ముచ్చట....॥
ఎల్లప్రాయపు గువ్వల్లా
ఎగిరే తువ్వాయిల్లా
ఎదుగుతున్న పసిపిల్లలు
ఎంతో ముచ్చట!
చైతన్య దీపాలు పసిపిల్లలు
చిన్నారి మనసులకు లేవెల్లలు॥

*

మమకారం - వయసిచ్చిన
వరం వాళ్ళకు -
మంచితనం ఆలంబన
వాళ్ళ మాటకు -
మచ్చలేని నడవడిలో
స్వచ్ఛమైన ఒరవడిలో
పసిపిల్లలె ఆదర్శం
పెద్దవాళ్ళకు॥ -
చైతన్య దీపాలు పసిపిల్లలు
చిన్నారి మనుసులకు లేవెల్లలు॥

గడుసుపనం - చిలిపితనం
కవలపిల్లలు....ఆ
పిల్లలకు....పసిపిల్లలు
కన్నతల్లులు....
అనురాగమాలికలకు
ఆనంద డోలికలకు
అందమైన అద్దాలు
పసిపిల్లలు॥—
చైతన్యదీపాలు పసిపిల్లలు
చిన్నారి మనసులకు లేవెల్లలు॥

*

నేటిపిల్లలంతా....ముందు
ముందు పెద్దలు....ఈ
నాటి పెద్దలంతా....ఒక
నాడు పిల్లలు ....
అంతెందుకు గంగానది
ఆదిశక్తి గౌరి కూడ
పుట్టినపుడు ప్రకృతినే
బులిపించిన పిల్లలు॥
చైతన్య దీపాలు పసిపిల్లలు
చిన్నారి మనసులకు లేవెల్లలు॥

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

# "శాంతి విలాసం"

లక్షలతో రమణులనే కొన్నాను
కోట్లుపోసి జనకోటిని కొన్నాను
కొన్నాను స్వాములనూ భూములనూ
శాంతిని కొనలేక దెబ్బతిన్నాను.

సంసారం చేయడమూ శాంతికోసమే
సన్యాసైపోవడమూ శాంతికోసమే
పెద్దలంత కలిసి మంచి బ్రహ్మచారికి
పెళ్ళిచేసి వేయడమూ శాంతికోసమే.

శాంతి విరిసిపాడేను పచ్చదనంలో
శాంతి మురిసి ఆడేను తెల్లదనంలో
శాంతి కళలువాసేను నల్లదనంలో
శాంతి కనులుమూసేను ఎర్రదనంలో.

పాతాళం పొంగితే అశాంతే
పైలోకం వంగితే అశాంతే
న్యాయం పట్టాలపైన నడిచే
నరశకటం జారితే అశాంతే.

బలవంతుల కోసమని ఒక యుద్ధం
ధనవంతుల కోసమని ఒక యుద్ధం
రణాలకూ కారణాలు అనేకం
శాంతిస్థితి కోసమని ఒక యుద్ధం!

ఆకాశం వెదికినాను; శాంతి ఎక్కడుంది?
అవని అంత వెదికినాను; శాంతి ఎక్కడుంది?
చుట్టుపట్టు లరసి కడకు గుండెలోకి చూశా
నాలోనే బికుబిక్కున శాంతి నక్కివుంది!!

డా॥ నాగినేని భాస్కరరావు

# నేటి భారతంలో దీపావళి

అవును నేడు దీపావళి - భారతంలో మాత్రం తిమిరావళి
మనిషి మనిషిలో, ఇంటింటిలో, వీధి వీధిలో -
ఊరూర్లో, జిల్లా జిల్లాల్లో, రాష్ట్ర రాష్ట్రాల్లో -
పెరిగి పెరిగి, మరిగి మరిగి, మురిగి మురిగిన సోమరితనంతో
అవును నేడు దీపావళి - భారతంలో మాత్రం తిమిరావళి.
న్యూఢిల్లీ నుండి - కార్పొరేషన్లు, మున్సిపాలిటీలు, లక్షదీవులు
లక్షలాది గ్రామాల గల్లీ గల్లీకి - తల్లీ తల్లీ అంటూ
మళ్ళీ మళ్ళీ పిలుపుల్తో, చేతులు నలుపుతూన్న అప్పులరాయుళ్ళతో
అవును నేడు దీపావళి - భారతంలో మాత్రం తిమిరావళి.
పరిశుభ్రమైన బజారులు దుమ్ము లేవని దారులూ
దేశీయ ఎరువులతో పండినపంటా, కట్టెలతో వండిన వంటా
స్వచ్ఛమైన నీటితో పారే సెలయేళ్ళు, ఫలాలతో తీరాల చెట్లు
ఒంటినిండా బట్టతో, కంటినిండా నిద్రతో
అరమరికలు, అసమానతలు లేని సంఘం కోసం
ఆరుగాలం శ్రమిస్తూ ఆశల్ని పెంచుకుంటూ
జాతి సమగ్రతా రథంలో దేశభక్తి అశ్వాన్ని పూన్చి
పర్యటించే పౌర జీవన శాంతిపై పరవశించే శాంతి శిరసుపై
ఒకచోట - పటకా కత్తులతో, ఉత్తరించని కేశాలతో
విదల్చని గడ్డాల దాడితో-
అవును నేడు దీపావళి - భారతంలో మాత్రం తిమిరావళి.
ఒకచోట - కాలే కడుపు, వణికే కాళ్ళు, ఒళ్ళంతా చెమటతో

ఇడుముల వంగిన నడుము, మడమలు త్రిప్పని బానిస బ్రతుకుల్నించి
అజ్ఞానం బంధాల్నుంచి తప్పించే పేరుతో
రైఫిళ్ళతో, గంబ్రడ గొడ్డళ్ళతో, బాంబులతో కొందరి-
పర్యటించే పౌర జీవన శాంతిపై పరవశించే శాంతివక్షస్థలంపై
అమానుష చర్యతో -

అవును నేడు దీపావళి - భారతంలో మాత్రం తిమిరావళి.

ఒకచోట—

పరాయి దేశంనుండి, పరాయి భావాల్తో దేశ ప్రవేశం చేసి
దేశీయుల్ని మచ్చిక చేసికొని మరులు కొల్పి
భ్రమలతో విభ్రాంతం కల్పించి, విద్రోహం పుట్టించి
దానికి భాషా కషాయం పట్టించి
దొంగ రవాణా, దొంగవేషాలు, 'సజీవ మానవ బాంబర్లు'
ఆత్మాహుతి దళాలు, అంగనామణులు అత్యంత గోప్యంగా
పర్యటించే పౌరజీవనశాంతిపై పరవశించే శాంతి శరీరానికి
కొందరు పెడుతున్న హింసలతో చేస్తున్న గాయాలతో-
అవును నేడు దీపావళి - భారతంలో మాత్రం తిమిరావళి.

ఒకచోట—

ఐదు నక్షత్రాల హోటళ్ళు (భారీ పరిశ్రమల లోగిళ్ళు)
వృత్తి విద్యాకళాశాలలు - ఆస్పత్రులు, చర్మ వ్యాపార విభాగాలు
స్మగ్లింగ్ కింగ్‌లు, భూ, జల, వాయు మార్గాల మార్గదర్శకులు,
నిత్యలంచ స్వీకరణ వ్రతులు నిత్యమద్య మదవతి ప్రియులు
నిత్యహత్యాకాండ పరాయణులు, వేలవేలకోట్లకు పడగలెత్తి
పరువంతో పరుగులిడుతూ, భయపెడుతూన్న పెట్టుబడి రాచసర్పంగా
తను తినగా తినగా మిగిలిన, ఎండిన, ఎంగిలి కవ్వల్ని
నోరూరించేటట్లు, లొట్ట లేసుకొని తినండని, వాటికి
భాష మతం కులం తెగ ప్రాంతం
అధికారం లాలసతల పేర్లతో
మాయమాటల మసాలా పట్టించి విసిరేస్తే -
కాయకష్టం చేస్తూ కపటమెరుగని జీవులైన జన చీమలు
గుంపులు గుంపులుగా త్రోసుకుంటూ, రాసుకుంటూ-

ఒకర్నొకరు కొట్టుకుంటూ, తిట్టుకుంటూ, కుంటుకుంటూ
ఆ కవ్వల్ని పట్టిలాగుతూ తలోదారి వెళ్ళుతున్న తరుణంలో
చలిచీమల నీతినిసైతం మర్చిపోయి ప్రవర్తిస్తున్న యీ సమయంలో
అవును నేడు దీపావళి - భారతంలో మాత్రం తిమిరావళి.
ప్రతిచోట-
చిచ్చుబుడ్లు లేకుండానే కదా వెలుగులున్నాయి
తగులబడుతున్న గుడిసెలవల్ల
కాకరవువ్వులు లేకుండానే కదా వెలుగుతున్నాయి
కాలుతున్న అమాయకుల శవాలవల్ల
బాంబులు సీమటపాకాయలు లేకుండానే కదా
ప్రేలుడులున్నాయి మన రైళ్ళు, బస్సులు, వంతెనల వల్ల
మతాబులు, విష్ణు భూచక్రాలు లేకుండానే కదా
వెలుగులున్నాయి మన గుండెల్లో ఆరని మంటలవల్ల
రాకెట్లు లేకుండానే కదా దూసుకుపోతున్నాము
నింగిలోనికి మన వస్తువుల ధరలవల్ల
ఈ మంటల రాగాలాపనకు నర్తించిన వెలుగులు
నశించి బూడిదైనవేళ—
బూడిదపాలై రోదిస్తున్న బ్రతుకులనిండా
చిక్కని చీకటి చిందినవేళ—
అవును నేడు దీపావళి - భారతంలో మాత్రం తిమిరావళి.
పర్యటించే పౌరశాంతికి మొత్తంగా గాధావళి, బాధావళి
అవును నేడు దీపావళి - భారతంలో మాత్రం తిమిరావళి.

డా॥ వాసా ప్రభావతి

# మనిషి

తన చుట్టూ వున్న సమాజపు
సరిహద్దులలో పరుగులు పెడుతూ
తన చుట్టూ ఆవరించి వున్న
ఆలోచనాబంధాలతో ఆటలాడుతూ
తన చుట్టూ పెనవేసుకున్న
మమకారాల ఒడిలో కేరింతలు కొడుతూ
తనకొరకే కాక
తన చుట్టూ వున్నవారికై
ఆలోచించి ఆచరించేవాడు మనిషి.

మహా సంద్రమువంటి హృదయంలో
పడిలేచే తరంగాలవంటి
ఆలోచనాపరంపరలతో
ఉవ్వెత్తున ఎగసిపడుతూ
కాలికింద నేలను తవ్వే
పరుల ప్రయత్నాల పెనుతుఫానులో
నిశ్చలంగా నిలబడి
నిర్భయంగా పలికే
సాహసమూర్తి మనిషి.

పాత బాటలు గతాన్ని చూపుతున్నా
నడిమి మాటలు పక్కదారులు పట్టిస్తున్నా
కొత్త బాటలు చిమ్ముకుంటూ

నవభావం పేర్చుకుంటూ
సాగిపోయే చైతన్యరూపం మనిషి.

అరిషడ్వర్గాల హాహాకారాలలో
పురుషార్థాల కొలిమిచిచ్చులలో
ప్రజ్వరిల్లే నూత్న రూపం
పడగలెత్తే ఆదర్శభావం మనిషి.

వేయి గొంతులు తనలో వున్నా
పదివేల గొంతులు తనచుట్టూ వున్నా
తీయనైన పిలుపులతో
నవ్యమార్గం తలుపు తట్టాలని
కొత్తదనం తొంగిచూడాలని
ఉద్యమించే ఉద్యమరూపం మనిషి.

స్వార్థం నోరు తెరచి నిప్పులు కక్కుతుంటే
దేశ ప్రగతి చేతులు చాచి పిలుస్తుంటే
ప్రజలకొరకు పరుగులెత్తేవాడు
అందరిలో తానొక్కడై నిలిచేవాడు
అందరిని ముందుకు నడిపేవాడు మనిషి.

అజ్ఞానం చుట్టూ ఆవరించి వున్నా
విజ్ఞానపు దీపం వెలిగించాలని
ఆ వెలుగులో అందరినీ నడిపించాలని
తపించే దీక్షామూర్తి మనిషి.

బద్ధకం సోమరితనాన్ని మప్పుతున్నా
అవసరం చేతనాన్ని మేల్కొలుపుతుంటే
ఎదురువీచే పరిహాసాలను తోసుకుంటూ
దారిపొడుగునా ప్రయత్నాన్ని విత్తుకుంటూ
సాగుచేసే హాలికుడు మనిషి.

ఎన్ని కళలు నేర్చినా
ఎంత రాగం నింపుకున్నా
మరో మనిషి తన హృదయం మీటాలని

కొత్త రాగాలు పలికించాలనీ
తపించే కళాతపస్వి మనిషి.

తన చుట్టూ ఎగిసిపడే
ధూళిధూసరితాలతో
బరువెక్కిన తన కనురెప్పలను
ఏ చల్లని మృదు తరంగమో విచ్చేసి
తన కనురెప్పలపై కప్పిన ధూళిని తుడవాలని
తన జ్ఞానేంద్రియాన్ని మేలుకొలపాలని
విశ్వరాగం ఆలపించే
అనురాగ గీతం మనిషి.

నిత్యం తన ఆలోచనలకు
కొత్త నగిషీలు చెక్కాలని
కొత్త ఆలోచనాపుష్పాలు పూయించి
కొత్త సుగంధాలతో ముంచెత్తాలని
నిత్యం పరిశోధన గావించే పరిశోధకుడు మనిషి.

ఎన్ని జీవులు పుక్కిలించి ఉమిసినా
తరగని సముద్ర జలంలా
ఎందరు నమిలి మింగినా
తరగని హృదయంతో
ఆలోచనాతెరచాపలు ఎత్తి
ఈ విశాల ప్రపంచ సంద్రాన్ని
అవలీలగా దాటాలని
అవస్థ పడేవాడు మనిషి.

ఆపదకు కరిగినా, కోపానికి పెరిగినా
సంతోషానికి ఉబికినా
స్థానం విడువని గుప్పెడు గుండెతో
ఆలోచనా బాణాలను పేర్చుకుంటూ
ఆకాశంలో నక్షత్రంలా వెలిగేవాడు
లోహాల్లో బంగారంలా మెరిసేవాడు మనిషి.

మానాభిమానాలను సంధించే
అరడుగుల మనిషి.
అవమానం ఎదురైతే
వామనుడై ఆకాశం ఎత్తుకు పెరిగేవాడు
ఏ ఆయుధాలు చేతలేకుండానే
ఎత్తుకు పై ఎత్తులు వేస్తూ
దేశాలు ఏలేవాడు మనిషి.

పట్టుదలే ప్రాణంగా
ప్రయత్నమే ఊపిరిగా
అవయవాలే పరికరాలుగా
చైతన్యమే మేలుకొలుపుగా
పనిచేసే రూపం మనిషి.

అందుకే చంద్రునిలా అమృతవర్షుడు
సూర్యునిలా నిత్యచేతనుడు.

ప్రాతూరి శ్రీనివాస్

# కొత్తగాలి

అక్కడ
నివురు ఊడిన కొత్తగాలి
ఆరని జాతివిద్వేషచితిని చూచి ఆశ్చర్యపోయి
స్వేచ్ఛాస్వాతంత్ర్యాలపై మళ్ళీ నీళ్ళు చల్లుతోంది
శవాలమీది పువ్వులను ఏరుకొని వచ్చి
మాలలు గ్రుచ్చి అమ్ముతోంది
తనకు రాజసౌధం నిర్మించిన చేతులే
సమాధులు కడుతుంటే ఊపిరాడక తెల్లబోతోంది
ఇక్కడ
నివురు ఊదిన కొత్తగాలి
ఆరని జాతి పౌరుషాగ్నిని చూచి ఆశ్చర్యపోయి
పువ్వులు పంచిపెడుతోంది
అనేకత్వంలో ఏకత్వం మళ్ళీ విస్తరిస్తోంది (వికసిస్తోంది)
అవకాశవాదపు గుంటనక్క వెన్ను
పునాదిరాళ్ళతో విరిగిపోయింది
రాజకీయ రావణకాష్టాలు ఎన్ని అడ్డుపుల్లలు వేస్తున్నా
జాతి రక్తబిందువులతో గోపురాలను నిర్మిస్తోంది.

డి.ఎ.ఎల్.ఎన్. మూర్తి

# తెలగులో అవధానములు

దేశ భాషల లెస్సయౌ తెలుగులోనె
కలదు అవధానమను కళాఖండ మొకటి
ఆశుధార, ధారణయు, ధైర్యంబు, బుద్ధి
బలము, జ్ఞానంబు, రసికత వలయు కవికి. 1

తిరుపతి కవీంద్రుల యుగంబు తెలుగునాట
సాహితీ రంగముల యందు స్వర్ణయుగము
శత సహస్రావధానముల్ జరిపి ప్రజల
కవులు పండితులుగ జేయగలిగినారు. 2

రాజసభల, ప్రబంధాల రచనలందు
దరిశనంబిచ్చు మా కవితా వధూటి
వాడవాడల పల్లెల పట్టణముల
కరిగె తిరుపతి వేంకటేశ్వరుల తోడ. 3

ఆంధ్రమందు నేడు అష్టావధానులు
శతవధానులైన సహజ కవులు
గలరు పెక్కుమంది కైతల క్రొంగొత్త
విషయములు ప్రవేశబెట్టినారు. 4

వలదన్న అక్షరముల వీడుచును "నిషి
ద్ధాక్షరి" మంచి పద్యంబు గూర్చు
గాంగ నిర్ఝరివలె కడువేగమున "ఆశు
కవనంబు" అద్భుత కరణి జెప్ప

"వర్ణన" కోరగా వర్ణచిత్రంబునే
కనుల ముందరనె సాక్షాత్కరించు
విపరీత అర్థాల వింత "సమస్య"ల
స్ఫూర్తితో తెలివిగా పూర్తిజేయు
ఏవో నాలుగు పొడిమాట లీయ వాని
"దత్తపది"గ సుమధుర పద్యంబు గూర్చు
ఎన్నొసారులు మధ్య మ్రోయించి నట్టి
"గంటల"ను గంట కొట్టిన కరణి జెప్పు. 5

న్యస్తాక్షరి, చదరంగము,
వ్యస్తాక్షరియున్, పురాణపఠనం, బేదో
ప్రస్తావనకు ఛలోక్తులు,
విస్తారము ఆశుకవిత విద్యలు చూపున్. 6

తేది యిచ్చిన వారంబు తెలుపుచుండు
చీట్లపేక చిత్రాక్షరి చేర్చి అందు
ఏవో ఎనిమిది అంశాలు నేర్పరుపగ
జరుగు నష్టావధాన ప్రశస్తసభలు. 7

శతవధానాన వంద పృచ్ఛకులు అడుగు
ప్రశ్నలకు పూట కొక్కొక్క పంక్తి జెప్పి
అంతమందున పూర్తి పద్యాలు తిరిగి
చదివి అవధాని కవుల నాశ్చర్యపరచు. 8

శ్రీనాథ కవిరాజు సీస పద్యాలలో
శయ్యల సొంపుల చందమునను
ధూర్జటి సుకవి శార్దూల మత్తేభాల
ప్రౌఢ గంభీరమౌ రచనల వలె
సుమతీ శతకకారు సుప్రసిద్ధ కవిత
కందాలలో మకరంద మటుల
వేమన్న కవి ఆటవెలదుల నడకల
సొంపు వైచిత్ర్యాల సొబగువోలె

ఒక్క అవధాని కవుల కొక్కొక్క డగుచు
కడు చమత్కార మాశ్చర్యకరము గాగ
ఆశు ధారకు తగిన పద్యాలు జెప్పి
సభను ముంచెత్తు నానంద సాగరమున. 9

పద్యములకు కలుగు ప్రాచుర్య మిసుమంత
తరుగలేదు కవుల కొరతలేదు
భాషయందున అభిలాష కల్గి పఠింప
పద్యమెంత యైన హృద్యమగును 10

భావరస బంధురంబగు పద్యములను
దుడ్డుకర్రతొ కొట్టినా నడ్డి విరుగ
దరయగా దుడ్డుకర్రయే విరుగునేమొ
పద్యములు చిరంజీవులై వరలుగాదె! 11

తరచు సాహిత్య సభల నేర్పరచి, కవుల
కావ్యములు పెక్కు ప్రచురించి, కవితగూర్చి
పలు ఉపన్యాస లహరులు వెలయజేసి
భారతిగ "యువ భారతి" వరలు మాకు. 12

దీవి శ్రీనివాసమూర్తి

# భావ మందారాలు

ఎదుట ఉన్నంతవఱకు ఇచ్చకపు పలుకులు
ముఖము త్రిప్పగనే పుల్లవిరుపు మాటలు
పదవి ధనము బలమునుబట్టి గౌరవం
అవి తగ్గినవానిపని పరాభవం
ఇష్టమై కలిస్తే ప్రేమబంధం
అయిష్టంగా చేరితే మానభంగం
మానవుని మేధస్సు ప్రకృతిని ఛేదిస్తోంది
మనుషుల మనసు అధోగతికి జారుతోంది
సాంకేతిక పరిజ్ఞానం పెరిగిపోతోంది
మానవత్వపు విలువ తరిగిపోతోంది
మనిషి సాధిస్తున్నది ప్రగతా? అధోగతా?
ఇదెవ్వరు విప్పిచెప్పలేని శేషప్రశ్న.
ఆ గురువుకడ నేర్చుటచే తన జన్మచరితార్థం
అయ్యిందనేవాడు అలనాటి శిష్యుడు
ఫలానావారికి చెప్పాను తన ప్రతిభను
గుర్తించండి అంటున్నాడు నేటి గురువు.
నీతికోసం నిలబడుట నాటి నాయకుల సద్గతి
నోట్లు విరజిమ్ముట నేటి వినాయకుల పద్ధతి
ధర్మంకోసం పదవిని తృణప్రాయముగ
విడిచారు ఆ ప్రభువులు
పదవికోసం పరువు పోయినా ఫరవాలేదు
అంటున్నారు ఈ పాలకులు.

న్యాయంకోసం సర్వం త్యజించారు నాటి రాజులు
ఆ పదమునే తుడిచేశారు నేటి తరాజులు
మధువు, మగువ, మృష్టాన్నం ఇవే నేటి స్వర్గాలు
వానిని పొందుటయే అందరి జీవిత లక్ష్యాలు.

అవసరమైనప్పుడు అందలమెక్కించి
వంగి వంగి నమస్కరిస్తారు
అది తీరిపోగానే ఎరగనట్టే ప్రవర్తించి
ఒక ప్రక్కకు తప్పుకొంటారు.

తనకు రావాలన్నప్పుడు ఆచారాలు ఉండాలంటాడు
తాను ఇవ్వాలన్నప్పుడు ఆదర్శాలు కావాలంటాడు

అందనిది అంతా త్యాగం
అనవసరమంతా వైరాగ్యం

కడుపులోని బిడ్డకు బయానా ఇచ్చుట
నాటి కన్యాశుల్క ప్రతిష్ఠ
గడపలో పురుషుని వేలం పాడుట
నేటి వరకట్నం పరాకాష్ఠ.

ఆడదాని మనస్సు అంతుపట్టని ఇంద్రజాలం
తెలిసికొను ప్రయత్నం శుద్ధ అవివేకం

ఆడవారి మాటలు ఏటినీటి వ్రాతలు
ఏది నమ్మిన ఏదరికి నీవు చేరలేవు

ఆడవారి నవ్వు గులాబిపువ్వు రువ్వు
మురిసి పట్టబోతే ముల్లు దిగబడు

ఆడవారి చేష్టలు మధుర ఊహల ఊపు
అంతలోనే చెదరి ఆరని జ్వాల రగుల్చు

ఎంతవారలయిన ఆడవారి మాట నమ్ముతారు
అంతటితో ఆగక తోటి మగవారిని మందలిస్తారు

విప్లవాలు ఉద్యమాలు వట్టి ఆర్భాటం
భుక్తి కొఱకు వేసే పగటి వేషం
ఎవరికి ఎటువంటి ఉత్తమ లక్ష్యం గాదు
శూన్యంగాక మరేమౌతుంది బ్రతుకు

సినిమా తారల మీద మితిలేని వ్యామోహం
తన మీద తనకే లేదు అంత అభిమానం

ఎచటనో జరిగింది చూపిస్తారు సినిమాలో
అట్లా చేయాలనుకుంటారు అర్భకులు జీవితంలో.

ఎదుటవారికి చెప్పుతుంటారు నీతులు
తాము మాత్రం తప్పుతుంటారు గోతులు.

ఎదుట వాడిని చూసి ఏడ్వటం ఎక్కువయింది
అదే వారి పతనానికి కారణమౌతుంది.

ఎదుటివాని పని ఎంతో సులభమనిపిస్తుంది
పొరుగింటి పుల్లకూర భలే రుచి అనిపిస్తుంది.

చదువు ఒకప్పుడు మనిషికి అలంకారం జ్ఞానప్రదం
అదియే ఇప్పటి కాలానికి వ్యాపారం ధనలాభం

తనకొఱకు తాను బ్రతుకుట మనిషితత్త్వం
ఇతరులకొఱకు తనను త్యజించుట దైవగుణం
తనకొఱకు పరులను వంచించుట రాక్షసత్వం

పదవికి వచ్చేదాక వల్లిస్తారు ఎన్నో నీతులు
ఆ తర్వాత ప్రారంభిస్తారు అబద్ధపు కూతలు

ఉద్యోగ మొచ్చేదాక ఒకటే పోరాటం
తీరా వచ్చాక అర్జన అనే ఆరాటం

ప్రేమాభిమానాలు వట్టి బూటకం
అవసరం తీరేవరకే ఆ నాటకం

జీవించటముకోసం తిండి ఏర్పాటయింది
తినటానికే జీవించటం అలవాటయింది.

పరిమితి ఉంటేనే ఏదయినా ముద్దు
హద్దు మీరితే మన జీవితాలే రద్దు
గుంభనమయితేనే శృంగారం అందం
విప్పిచెప్పితే అది ఎంతో వికృతం.

మనిషికి పశువుకు తేడా మనసు వాక్కు
అవి ఉపయోగించే తీరునుబట్టి పరువు బ్రతుకు

ఏమీ లేనినాడు అరుబయట హాయిగా నిద్రిస్తాడు
అన్నీ ఉన్ననాడు పట్టుపరుపుమీద కునుకుపట్టక చస్తుంటాడు.

ఏదీ తీసికొనిరాని నీకెందుకీ వేదన రోదన
ఒకటీ వెంటరానప్పుడు వ్యర్థంగదా ఆక్రందన

కాలం కర్మం కలసొస్తే కోటీశ్వరుడౌతాడు
అవే కనుక తిరగబడితే కాటికి దగ్గరౌతాడు

అనంతకాల గమనంలో మనిషి బ్రతుకెంత?
సరిపోల్చ వీలుకాని అల్పాతిఅల్పమంత!

సమాజపరిణామసిద్ధాంతం గ్రంథ ఆవిర్భావం
సౌలభ్యజీవనగమ్యం నిత్యసత్యసూత్రం

మాగిజైన్ పట్టుట ప్యాషనయింది
మెదడులో జ్ఞానంమాత్రం శూన్యమౌతోంది

నవలలో ఆదర్శసూత్రాలు వేలకువేలు
ఆచరణలో చూపువారు వ్రేళ్ళమీద లేరు

ఉన్నది ఇది అని చూపిస్తారు కొందరు
ఇది ఉండకూడదని అదే చూపిస్తారు మరికొందరు
ఏదయినా మనడబ్బు దోచుట వారిలక్ష్యం
మనసు చెడి బాధపడుట మన కర్మం

ప్రభుత్వ పథకాలన్ని పైవారికి క్రిందివారికి
మధ్య తరగతి బ్రతుకులు నడిసముద్రమున మునకలే

ఓట్లకోసం ఎన్నో పాట్లు పడుతుంటారు
కోట్లకు పడగలెత్తి కుక్కకంటె నీచంగా బ్రతుకుతుంటారు

మనిషి ముఖం తీరునుబట్టి చెప్పవచ్చును
వాడు ముచ్చో మూర్ఖుడో మందమతో మేధావియో

డబ్బుకు లోకం దాసోహం
మగువకు బానిసె ఈ లోకం

ఆడవారి అందం మగవారికి బంధం
అదే కాకపోతే అసలు సృష్టే శూన్యం

తప్పులన్నిటికి మూలకారణం ఆకలి మంటలే
నేరాలన్నిటికి ప్రధానం అతివల అందాలే

అతివల హృదయంలో అరలు ఎన్నెన్నో
మగవారిని వంచించే వగలు మరెన్నో

బ్రహ్మకయినా పుట్టు రెమ్మ తెగులని విన్నావుగా
పిల్లదాని మహిమ తెలిసిందా పిచ్చినాయనా

అబల : అతి సుకుమారమయిన అంగాంగ శరీరముతో
సబల : స్వాధీనమున ఉంచి నిత్యం సతాయించటములో

క్రీగంట నవ్వితే ప్రణయం
మునివంట కొరికితే ప్రళయం

కె. నాగేంద్రాచారి

# "కవిత్వం"

అక్షరాలతో యక్షగానాలు చేయిస్తుంది కవిత్వం
పదాల ఎదల్లో సుదీర్ఘ సుధాస్రవంతుల్ని పొంగిస్తుంది కవిత్వం
నిశ్చలతటాకంలో విచ్చిన చెంగల్వ అది
నెచ్చెలి సమాగమంలో వెచ్చని కరస్పర్శ యది
కస్తూరీ సుగంధం కౌస్తుభంలో అందం
కలగల్సినదే కవిత్వం
కవిత్వం
గుండెల్లో గుడారాలు వేస్తుంది
మస్తిష్కంలో మతాబులు వెలిగిస్తుంది
నేత్ర నేపథ్యంలో దిగుళ్ళనెగళ్ళ నెమళ్ళను చిత్రీకరిస్తుంది
శివాలెత్తి కవాతు చేస్తుంది
శీర్షమెత్తి సింహమౌతుంది
దిసెమొలతో తిరిగే పసిబిడ్డ కవిత్వం
కసిలోంచిపుట్టే రసయుక్తరాగం కవిత్వం
స్పందించే హృదయం సంధించేదే కవిత్వం
మందకొడిగావున్న డెందాన సందడి రేపేదే కవిత్వం
కదండొక్క గజ్జెలగుర్రం కవిత్వం
కవ్వించి నవ్వించే యవ్వనగీతం కవిత్వం.

# నిత్యసత్యాలు

1. మల్లెసౌరభాలు మహిత సౌధాగ్రాలు
మలయ మారుతాలు మరకతాలు
ఆలిప్రేమముందు అన్నీ దిగదుడుపే
నవ్యభాష్యకారి నాగచారి.

2. మాన్యప్రీతిగల్గి మదత్యాగ మొనరించి
బుధులు మెచ్చుపగిది ఎదుగవలయు
సర్వశుభము లొసగు సద్గుణమణిఖని
నవ్యభాష్యకారి నాగచారి.

3. ప్రణయపుటలు ద్రిప్పి పారవశ్యము నొంది
రేబవళ్ళు చెలగు ప్రేమజీవి
మరులుగొన్న మనసు మాటల కందదు
నవ్యభాష్యకారి నాగచారి.

4. నీరసించి దీర్ఘనైరాశ్య నశ్యంబు
పీల్చబోకు చితిని పేర్చుకోకు
చేవగలిగి సల్పు జీవన సమరము
నవ్యభాష్యకారి నాగచారి.

5. చెరుకుగడలకన్న పెరుగుమీగడకన్న
తెల్లద్రాక్షకన్న తేనెకన్న
తెనుగుకవితె నాకు తీయందనం సుమా!
నవ్యభాష్యకారి నాగచారి.

6. భూరిభూతిమీద భూభాగములమీద
భూషణములమీద బుద్ధి తగదు
బుధుల మెప్పు మేలు బుక్కెడన్నం చాలు
నవ్యభాష్యకారి నాగచారి.

7. శ్వేతకాంతి పుష్ప జాతులన్నిటియందు
జాజిమల్లెకేది సాటిరాదు
ప్రాభవమ్ము వలనె పదుగురి మెప్పులు
నవ్యభాష్యకారి నాగచారి.

సస్యశ్రీ

# ప్రజల మధ్యకు

—ఇవేమిటీ వింత భయాలు?
అందరికీ అందుబాటులోవున్న
అరటిపండును
కొందరికేనా కొరకరాని కొబ్బరిబొండం
ఆక్షేపిస్తోంది.
—ఇవేమిటీ అపస్వరాలు?
"వాక్యం రసాత్మకం కావ్యం" అంటుంది
సారస్వత వేదం;
ఛందోబద్ధమైన పద్యమే చెప్పాలి అంటోంది
సంప్రదాయ వాదం!
—అవేమిటా రంగుల నీడలు?
గుచ్చుకొనే గచ్చపొదల నెత్తిని,
పుచ్చపువ్వులు పూస్తున్నాయి;
పండుటాకుల పంగలలో గుత్తులు
లత్తుక కత్తులు దూస్తున్నాయి!
—ఎచటికి పోతా వీ రాత్రి
అంతరాత్మలను అమ్ముకున్న
ప్రబంధాల నుండి
భుజబలాన్ని నమ్ముకున్న
ప్రజల మధ్యకు.

(శ్రీశ్రీకి క్షమాపణలతో)

# మడతపడ్డ మగ్గాలు

అగ్గిపెట్టెలో పట్టే అపురూపపు వలిపాలను
ఉంగరాలలో దూరే ఉలిపొరలే నేసారట!
మగ్గాలను నేడెందుకు మడిచేసేరు?
చేనేతలు మీరెందుకు మానీసేరు?—

జామిజంబుఖానాలూ-చీరాలా చీరలేవి;
జమిలినేతలేవీ; ఆజామారులు ఏవి?
ఏదీ పొందూరు పాటినూలునేత ధోతి;
ఏదీ ఆ పట్టుసాలి వెలమనూలు ఖ్యాతి?

ఏదీ పందలపాకది పాలనూలుకోవా;
ఏదీ జనతాకోకల కొబ్బరి రసుకోరా?
నాట్యం ఆడే నాడెల నాదం వినపడదే;
కదురూకండెలు చేసే లాస్యం కనపడదే?

ఆసుపోయు అమ్మేదీ, అరుగుమీద లేదే;
సరిచేసే ఆలేదీ, పడుగు పక్క లేదే?

*　　　*　　　*　　　*

నేసేందుకు నూలులేక; చేసేందుకు కూలిలేక
కతికేందుకు మెతుకులేక, కనలుతున్నాము
బతికేందుకు తెరవులేక చితుకుతున్నాము

పేదరికం పేక చేసి; బడుగుతనం పడుగుచేసి
కడగళ్ళదో కలనేతలు నేస్తున్నాము
పస్తులుండి ఆకళ్ళతో చస్తున్నాము.

# దేశభక్తి గీతం

పరమ పునీతము వరదాయిని నీ
చరితము భారతమాతా;
కరములెత్తి కావింతుమమ్మ నీ
వరచరణములకు జోత.
జననీ! స్వర్గముకన్న మిన్న యీ
జన్మభూమి మాకెల్ల;
మననీ వర్గము లెన్నియున్న మా
మధ్యలేక ఏ ఎల్ల.
సమ్మతమౌ నీకన్ని మతమ్ముల
సారములే నీ హృదయం;
ఇమ్మహి ఇనుడేదెశను వెలిగినా
తూరుపునే కదా ఉదయం!
మువ్వన్నెల జాతీయ పతాకపు
నీడ నిలిచి నిను చూసి,
గర్వముతో నుప్పొంగెదమమ్మా
నింగికి నిచ్చెన లేసి!
ఒక చేతను "డాలో"క చేతను కా
శిక నాలుకవలె ''బాకు''
పట్టి నిలిచి కనుపట్టుమవమ్మా
పరాశక్తి వలె మాకు!
ఉగ్రవాద ఉన్మత్త శక్తులను
ఉక్కడంప కై జారు
ఎత్తి పట్టి, "ఎవరెస్టు'' కెగసి ఓ
భద్రకాళిగా మారు!

# ఎడారిపువ్వులు

ఎవరికోసము యీ ఎడారిని
నవ్వినవి యీ పువ్వులు?
ఆగిపోయిన యీ ఎడందను
ఆరిపోవని దివ్వెలు! ॥ఎ॥
ఎండమావుల గుండె లోతుల
లోనితడి పిండిన సరస్సులు;
కొలనిలో కలువల రహస్సులు
మహాభీకర "సహారా"లో
ఎవరికొరకో "వొయాసిస్సు"లు
ఎవరివో యీ మహాశీస్సులు? ॥ఎ॥
కాలజీమూతాల కడలను
జాళువా జలతారు వల్లులు
కాళరాత్రిని పాలవెల్లులు
మిన్ను మన్నుల తన్ను తెన్నుల
ఎవరికీ నడి నిశ నుషస్సులు?
ఎవరు చేసిరి యీ తపస్సులు? ॥ఎ॥
జరభి కాటుక కంటి సెగలో
"అరోరా బోరియాలిస్సు"లు
పరమసత్యపు రోచిస్సులు
కరుకులోకపు టిరుకు బాటను
ఎవరు త్రేల్చిరి యీ మహస్సులు
ఎవరు చీల్చిరి యీ తమస్సులు ॥ఎ॥
ఎవరికోసము యీ ఎడారిని
వేసిరీ పూసేసలు
మోడువోయిన యీ ఎడందను
మోసులెత్తగ ఆశలు? ॥ఎ॥

(లత ''ఎడారిపువ్వులు'' చదివి)

# మొలక నవ్వు

తొలకరి జల్లుల పలకరింపులకీ,
విరిచిన బెల్లుల పరిమళింపులకీ,
కల్లు కలకండ కాటులకీ,
గొల్లు కొనగోటి మీటులకి
మృత్తిక ఎద మెత్తపడి
పొత్తు కాయత్తమవుతుంది, మడి-
దుక్కిదున్నిన కొర్రులో
        మొక్క మొలిచే కోరిక
రేగి, రెక్క తొడిగినప్పుడు,
        చాలు చెక్కిళ్ళు చెలమలై
చెమరుస్తాయి చిత్తడి-
అట్టడుగు మట్టి పొరలలో
        పొత్తిళ్ళు పెట్టి,
అణగి మణగి స్థాణువై వున్న
        రేణువులను తట్టి
నేలలోని "తల్లితనా"నికి తలుపుతట్టి,
        మేలుకొలుపుతుంది మేదినిని, "అక్కడి"-
అప్పుడేదో చెప్పరాని
        రసానుభూతికి వశమై
అంకురార్పణకు తనను తాను
        అర్పించుకుంటుంది అవని ఒడి
ఆ ఆనందాతిశయంలో ఆవిర్భవిస్తుంది
ధరణి అధరాన దరహాసం కాదు "ధరహాసం"
'పుడమి పెదవిపై మొలకనవ్వు'
అవును- మొలక నవ్వు!

ఊటుకూరి? 

ఊటట్ల కొండయ్య

# "యుగయుగమ్ముల భారతీయుడను నేను"

ఆ సముద్ర హిమాచలమైన సర్వ
మేకమై, యవిభాజ్యమై, నాకమట్లు
నా మనస్సీమలో నర్తనమ్ము సల్పు
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 1

ఏ నాకడ నీ మహావిశ్వమెల్ల గడచి
కడచి కనరాని యొక కల్పకమ్ము నందు
తీవెనై, పూవునై, వింతతావినై తి
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 2

స్వప్నమే జీవితమ్మయి, స్వప్నజీవి
తమ్మె సత్యమై, స్వప్నసత్యమ్మె యొక్క
స్వర్గమై నేనె స్వర్గమై పాడినాను
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 3

ఎరుకలేని పరులు నన్ను హిందు వనిరి,
వేదమతము నాయది, సర్వ విశ్వశుభము
నాతపోఽధ్యయనాధ్యాపనమ్ములాయె
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 4

అర్కదేవుడు నా తండ్రి, అఖిల కార్య
జాత మార్గదర్శి భగవద్గీత నాకు
కర్మరాహిత్యముం జూపి కాచు గురుడు
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 5

కులము నాయది మానవకులము, జనని
భరతజనయిత్రి, వాల్మీకి వ్యాస బుద్ధ
కాళిదాసాది శంకరాగ్రజులు కలరు
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 6

సర్వ భాషాముఖుండను, సకల ఖచర
నిచయ పికచస్వర సమైక్య నిబిడ మధుర
సుస్వరమ్ముల నినదించు సురతరువును
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 7

సత్యమున హింసయును రథాశ్వములజేసి
శాంతి రథమున మానవజన్మముంచి
నడుపు సారథి గాంధి శిష్యుడను నేను
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 8

బ్రాహ్మణుడను నేనే, నేనె పంచముడను
పరమపావనుడను నేనె, పాపి నేనె,
శివుడనైతిని, క్షుద్ర మానవుడనైతి
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 9

శత సహస్రార్బుదోదరసదనవాసి
నగుచు సృష్ట్యాది సభ్యుదయాధ్వమందు
నేతి నేతి యనుచు పయనించినాను
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 10

బాహ్య సందర్శనాపేక్ష భ్రమలు గొలుపు
లోకమునకు రమ్యాంతరాలోకన మ్మొ
సంగనేర్చిన యోగ వర్చస్వి నేను
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 11

శివము సుందరమగు సర్వసృష్టి నాకు
మనుజజన్మ మానంద సంభవము నాకు
త్యాగ మైహిక భోగభాగ్యములు నాకు
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 12

జనన మరణాధ్వమున బెట్టి చనిరిచూడు
మెవరొ నను, వారి కనుగొన నేగుచుంటి
అంతమే లేని ఈ మహాయాత్రలోన
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 13

చీనిచీనాంబరములు కై సేసి జగము
దేహ సౌందర్య మర్చింప, దిశలు వెలుగ
నిగ్రహాంబరధారినై నిలిచినాను
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 14

భోగమయమగు జగమున యోగమయుడ
కామమయమౌ జగమున నిష్కామమయుడ
పంకమున బుట్టు పద్మమై పరిమళింతు
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 15

నన్ను శోషింప దెట్టి దుర్నయమునేని
లోనికిం జొర దెట్టి వైరుధ్యమేని
అట్టి గరిడీల బెరిగిన యట్టివాడ
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 16

ఒరునకును నాకు జీవనసరళి వేరు
పాపమొనరించి వాడు దర్పమ్ము వడయు
పాపమును కాలద్రోయు నిర్భయుడ నేను
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 17

అఖిల జీవరాసులును నాయందె యున్న
యట్లు నాలోన మసలుచున్నట్లు తోచు,
సృష్టితో కలబేనిన జీవి నేను
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 18

కొండపై చుక్కదిశ చూపుచుండు రేల
కనులనింపును వెల్గు భాస్కరుడు పవలు
భుజము తట్టు ననిలుడు ముప్పొద్దు నన్ను
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 19

తలపు తలుపులు త్రోసె నే మలయపవన,
మంతరము తొంగిచూచె నే కాంతిరేఖ?
అంటుకొనిపోయి కనులు పరుంటి నిచట
యుగయుగమ్ముల భారతీయుడను నేను. 20

'సాహిత్యబ్రహ్మ'
డా॥ వి. వి. యల్. నరసింహారావు

# ప్రబుద్ధ యువ భారతం

మండుటెండల గుండెలు మండుచుండ
జీవనము లేక బ్రదుకు కెండి పోవుచుండ
తిరుగబడు యువతను ప్రబోధింప
ముసలి తెలుగుకవి వచ్చె 'యువభారతీ' గళాన. (1)

నవ వసంతము, కోకిలారవము, మలయ
మారుతము, 'మల్లెమాల' గమగమ, మనసు
పరవశింపజేసినను జీవన సమస్య
మంటలెగజిమ్మ యువలోక మధ్యమందు. (2)

పదవు, లధికారములును, సంపదలు,
అక్రమార్జన, లవినీతి గతు, లహంకృతులును
సంఘమున వెట్టి తల వేయ సాగినపుడు
బ్రతుకు తెరువు దొరకని యువతకు-నేడు
కనబడెడు మార్గములు మూ; డొకటి
ప్రశాంత సౌమ్యమార్గ, మయ్యది ఫలించనపు డుగ్ర
వాద పద్ధతి, అది ఫలింపనపు డొక్క-
పెట్టి దౌర్జన్య బీభత్స విధికి దిగుట. (3)

అన్నియును మన కనుభూతమయ్యె నేడు;
కాని కనువిప్పు కలుగ దొక్కరికి నేని;
ఎవరి స్వార్థమ్ము వారిదే; ఎందు
త్యాగభావ మిసుమంత గోచరింపదు జగాన. (4)

కావున నాత్మరక్షకు, నఖండ మహాభరతోర్వి రక్షకున్,
భావితరాల వారికి శుభంబులు కల్గగ, వర్తమాన సం
భావన చేసి మీ యువ సమాజము లింక పురోగమింపుడీ,
మీ వలె బాలబాలికలు మేలి పథమ్ముల సంచరింపగన్. (5)

యువలోకంబు నిరాశ నిస్పృహ నిరుద్యోగార్తి నుద్విగ్నమై
పవలున్ రేలు దురంత దుర్వ్యసన దుర్వ్యాపార ప్రమత్తంబునై
భవితవ్యం బొక బందిసున్నయగు దౌర్భాగ్యస్థితిన్ చిక్కినన్
తవులున్ పాపము జాతిపెద్దలకు ఔదాసీన్య దోషంబునన్. (6)

కె. వెంకట శివయ్య

# అన్వేషణ–నివేదన – ఆత్మాహుతి

ఎచ్చటెచ్చట నున్నావొ ఎరుగనైతి
వెదకి నీ కోసమై కడు విఫలుడైతి
కాని చివరకు తెలుసుకొన్నాను నేను
నీవు నా నిండుగుండె నున్నావటంచు.

అందచందాల నపురూప మాలయమ్ము
ఇంపు తొలుకాడ నేను కట్టించలేను
స్వామి హృత్సీమ మిగుల శుభ్రమ్ము జేసి
కొమరు జొత్తిల్ల కట్టింతు గుడిని నేను.

చందనాగరు కర్పూర జలముతోడ
స్వామి కావింపజాలను జలక మేను
రాత్రి పవలని లేక విశ్రాంతి లేక
చేయగలవాడ రక్తాభిషేక మేను.

షడ్రసోపేత రుచ్య ప్రసాదములను
రస ఫలమ్ముల నైవేద్య మొసగలేను
స్వామి నీ మీది భక్తి భూజమ్ము మధుర
భావ ఫలముల నీకు నర్పణము సేతు.

నీ విలాసార్థమై రమ్య నృత్యములను
మించు నర్తకిచేత చేయించలేను
స్వామి! అంతర్ముఖుండనై పరవశించి
భావ నాట్యమ్ము సేతు నీ పదము గాంచి.

వేణు వీణా మృదంగాది వివిధ గతుల
దివ్య సంగీత సంగతుల్ తీర్చలేను
మేలి, నా మేనిలోని నరాలమీటి
సోలి పలికింతు స ప్త స్వరాల నేను.

స్వామి నా గుండె నీవుండ నేమికొరత
కాని నీ గుండె నేనుండ కలదు కోర్కి
దిద్ది నీ గుండెలో నన్ను తీర్చువరకు
స్వామి నా గుండెనుండి నిన్ వదలనయ్య.

తనువు చిల్లులు జేసి స ప్త స్వరాల
మురళినై నేను పాడనా పరవశించి
నీ కరాబ్జము చేరనా నీదు పెదవి
కోరనా ఉండిపోన నీ గుండెలోన.

మేని చర్మము తీసి అనూనమైన
ఢమరుకమ్మయి మ్రోగనా! ఢమర ఢమర
యంచు నీ చేత ఆడనా! ఆడి ఆడి
అలసి స్వామి! నీ సాయుజ్య మందుకోన.

నాదు నశ్వర దేహమ్ము, వేదపేటి
చేయనా స్వామి! నీకు, నీ చేత నుండి
పోన, వేదరూపము దాల్చి పొంగిపోన
ఉల్ల ముప్పొంగ నీ నోట నుండి పోన.

డాక్టర్ కొండలరావు వెలిచాల

# శుభాకాంక్షలు

అందుకో నేస్తం నవ వత్సర శుభాకాంక్షలు,
నవ్య దృష్టికి, నవ్య సృష్టికి, నవ్య మమతా వృష్టికి నా ఆకాంక్షలు.

వాంఛలనంతమయి, 'స్వ'భావమే సర్వభావమూ అవుతోన్న
ఈ శతాబ్దం తుది దశాబ్దంలో అడుగు పెడుతోన్న ఈ తరుణంలో
ఏమని కోరను నేస్తం నీ కొరకు?
కలలు కరిగిపోతూ, కల్లలు పెరిగిపోతూ, కల్మషాల వడగండ్ల వానలు
కురుస్తోన్న ఈ సమయాన
ఏమని అడగను నేస్తం మనందరికొరకూ?

చూడు నేస్తం! ఎంత తరిగిపోతూ ఉందో, సహభావం, సమతాభావం,
సౌహార్ద్రభావం;
ఎంత ఓగిపోతూ ఉందో విశ్వభావం, విశాలభావం, విచక్షణా వివేచనా
వినమ్రతా భావం;
ఎంత పెరిగిపోతూ ఉందో వేయితలల వెర్రి వేర్వేరు భావం,
వేర్పాటుభావం.
అంతా ఉండికూడా అంతటా అదేదో అయోమయంగా లేదూ?
అంతటా ఏదో అగ్ని రగులుతున్నట్లూ, ఆకాశం పగులుతున్నట్లూ లేదూ?
హృదయం పగిలిన వీణలా పాడుతున్నట్లూ, మనసేదో మలిన పడిన
మానసంతో కృంగిపోతున్నట్లూ,
మాటేదో మామూలుగా పెకలక మరుచుట్లు తిరుగుతున్నట్లూ లేదూ?

రాత్రయింది, కాని తెల్లవారుతుందా?
రోజూ ఏ గడ్డూ లేకుండా గట్టెక్కుతుందా?
సమయం సవ్యంగా సాగుతుందా అని భయంభయంగా లేదూ?

అందరమూ ఈ దేశవాసులమే,
అందరమూ ఈ సంఘంలో భాగాలమే,
అయినా ఇదేంటిది? ఇది ఇలా ముసురుకొంటుందేంటిది
విసురులాంటి విరుద్ధభావం, కసురులాంటి కటువు భావం,
కఠోరభావం?
ఇదేంటిది? దేహమొక్కటే; కాని మనసూ, మేధా, హృదయమూ,
ఆత్మా, అంతస్సను భాగాలన్నీ వేర్వడినట్లు,
చిన్న చిన్న గదులు కట్టుకొని 'ఫ్లాట్లు' వేసికొన్నట్లు
ఛిన్నాభిన్నమయిపోతున్నాయేంటిది?

చూడు నేస్తం! చూడు!
ఆకాశమంత నాగరికతలో కూడా అరిగిపోయిన అద్దంలా, కరిగిపోయిన చంద్రబింబంలా
ఎలా కరిగిపోతూ ఉందో చూడు సంస్కారం, సహృదయ భావం.
చూడు, మానవుడని పిలవబడేవాడిలో కూడా,
మనిషి అని భావించబడేవాడిలో కూడా
మానవత ఎంత మలిన పడిపోతూ ఉందో
ఎంత మరుగున పడిపోతూ ఉందో
ఎంత మచ్చుకైనా కనబడకుండా మాయమయి పోతూ ఉందో చూడు.

రా నేస్తం! ఈ శుభవేళ, ఈ ఒకరికొకరు శుభాకాంక్షలు తెలుపుకొనువేళ.
కాస్త, తీరిగ్గా కూర్చొని మన కర్తవ్యం గురించి బేరీజు వేసుకుందాం రా!
రా! నీ గురించీ నా గురించేకాక, ఏ పాపాలూ ఎరగక, మన పాపాలకు
గురికాబోతూ ఉన్న మన పాపాయిల భవితవ్యం గురించి
మనసు విప్పి మాట్లాడుకుందాం రా!
రా నేస్తం! ఈ శుభవేళ, శుభ్రమయిన మనసుల్తో
అభయమను హస్తాల్తో,
'ఐక్యత' అను దీపాలను వెలిగిద్దాం రా!
రా! చెక్కుచెదరని చెలిమి పూలతో మంచికి హారాలు కూర్చుదాం,
మమతకీ హారతులు పడదాం,
మానవతకి 'మంగళహారతి' పాడదాం రా!

డాక్టర్ ఎన్. గోపి

# సముద్రమే నేపథ్యంగా

స్త్రీల పాదాల్తో పునీతమైన నేలకనుకనే
భూగోళం బద్దలు కాకుండా వుంది
కష్టజీవుల చెమటతో తడిసిన మట్టికాబట్టే
పగుళ్లువారినా పగిలిపోకుండా వుంది.

ఒక బృహత్తరమైన కన్నీటి పుష్పం
భూమికి గొడుగు పట్టబట్టే
ఎడారిలో గుక్కెడు నీళ్ళు పుడుతున్నాయి.

ప్రభాత బింబాన్ని కొప్పులో చెక్కుకుని
పనులు చేసుకుపోతుందామె
మధ్యాహ్న మార్తాండున్ని వీపుమీద మోస్తూ
చెమటకు కాలువలు తీస్తాడతడు.
సూర్యుడి శవంమీద పడి
పక్షులు గగ్గోలుగా దుఃఖిస్తాయి.

సముద్రమే నేపథ్యంగా
మనిషి పాట పాడతాన్నేను.

పిల్లల నవ్వుల్తో పులకరిస్తాయి కనుకనే
దిక్కులు పడిపోకుండా వున్నాయి.

ఇంత పెద్ద ఆకాశం కింద
చంద్రుడూ చుక్కలూ చూస్తుండగానే
పువ్వులు మరణించటాన్ని భరించలేను.

అగ్ని బాణాల సాక్షిగా
పక్షులు కూలిపోవటాన్ని సహించలేను.
ఎండను చీల్చుకొని మేఘాలు ప్రసరిస్తాయికనుకనే
గాలివొళ్ళు కాలిపోకుండా వుంది.
చెట్ల దేహాల నిండా వ్రణాలు కదుల్తాయి
గుట్టలు రెక్కలు తెగి కూలి పడతాయి.

క్షణం వెనక క్షణం నడుస్తాయి కనుకనే
కాలం చీలిపోకుండా వుంది.
మానవుడి ప్రయాణ మెక్కడికో తెలియదు.
ఈ బాటకు ఆయాసమే రాదు
ఎంత ఎత్తు కొండపైకైనా పాకిపోతుంది.

మనిషి నడుస్తాడు కనుకనే
ప్రపంచం ఆగిపోకుండా వుంది.
నరాలకు పాటలతోరణాలు కనబడతాయికనుకనే
చైతన్యం ఆరిపోకుండా వుంది.

డాక్టర్ నాగినేని భాస్కరరావు

# రూపాయి పాపాయి

నన్నందరూ కోరతారు - కాని
కొందరు నన్ను పెడతారు పాతర
కొందరు నన్ను పెంచుతారు పాపలా.

నన్నందరూ కోరతారు - కాని
కొందరు నా కోసం చేస్తారు ఘోరాలు
కొందరు నా కోసం చేస్తారు ధర్మాలు.

నన్నందరూ కోరతారు - కాని
కొందరు నన్ను పూజిస్తారు ఒక దేవతగా
కొందరు నన్ను పరిగణిస్తారు ఒక మారకవస్తువుగా.

నన్నందరూ కోరతారు - కాని
కొందరు నన్ను మారుస్తారు బంగారంగా
కొందరు నన్ను తారుస్తారు నల్ల బంగారంగా.

నన్నందరూ కోరతారు - కాని
కొందరు నా కోసం ఏడుస్తారు
కొందరు నా కోసం ఊడుస్తారు.

నన్నందరూ కోరతారు - కాని
కొందరికి నే నుంటాను దగ్గరగా
కొందరికి నేను పోతాను దూరంగా.

నన్నందరూ కోరతారు - కాని
అయినవాడి కొక హాయి నిచ్చే రూపాన్ని
లేనివాడి కొక చావు నిచ్చే శాపాన్ని.

అందరికీ అందీ అందని గోసాయి చిట్కాని
అందలమెక్కించేందుకు సిపాయిని - కాని
అణగద్రొక్కేందుకు కసాయిని
అవును నేనొక రూపాయి పాపాయిని.

డాక్టర్ అంతటి నరసింహం

# ఏం వ్రాయను తమ్ముడూ

ఏమి వ్రాయమంటావు తమ్ముడూ
యేమి వ్రాస్తే యేమో అన్న భయం
యేమీ వ్రాయకపోతే యెలాగా అన్న దిగులు
రాత్రంతా మేలుకుని ఆలోచించాను
దోపిడీ దొంగల గురించి వ్రాద్దామనిపించింది
వాళ్ళు చేసే క్రూర హింసల చూచీ
అమాయకుల - నిస్సహాయుల - ఆక్రందనలు వినీ,
కలాన్ని ఝళిపిద్దామనుకున్నాను

వాళ్ళు
ఆ దోపిడీ దొంగలు
తమ కడుపుల చూపిస్తూ
అక్రమ పోలీసుమిత్రుల చూపిస్తూ
అనునిత్యమూ ప్రజల రక్తాన్ని పీలుస్తూన్న
ప్రజా పరిపాలక జలూక జాతుల వేలెత్తి చూపిస్తూ
ఏమంటావు? - అని గద్దించినపుడు
అవాక్కునై పోతున్నాను

* * *

నక్సలైట్ల ఆకలి హత్యల చూచీ
విచక్షణా రహిత హింసాకృత్యం చూచీ
ఆత్మహనన సాహసాన్ని చూచీ
కరుణాభరిత మనోవ్యధాసహిత కోపంతో
కలమెత్తుదా మనుకున్నాను

వాళ్ళు!
ఆ నక్సలైట్లు
నిత్య పీడిత దరిద్ర ప్రజల చూపించి-
అనునిత్యమూ వాళ్ళను దగాచేసి, దోపిడీచేసి,
దోచి, దాచుకొనే మోసగాళ్ళ చూపించి
ఆ దొంగ మోసగాళ్ళకు అండగా వుండే
దగాకోరు ప్రజా ప్రతినిధులనూ,
నిష్క్రియాపర ప్రభుత్వాధికార్లనూ,
ఎన్‌కౌంటర్ల పేరుతో తమను వేటాడుతున్న
ప్రభుత్వాన్ని చూపిస్తూ
తర్జనిస్తూ - ఏమంటావ్ అని గద్దించినపుడు
అవాక్కునై పోతున్నాను

*　　*　　*

పబ్బం గడుపుకునే వంచనతో
దొంగ వాగ్దానోపన్యాసాలతో చెల్లించీ, బెదిరించీ,
వోట్లన్నీ దండుకొని గద్దెలెక్కి
ప్రజా సంక్షేమాన్ని సామ్యవాదాన్ని
గాలికీ నీటికీ వదిలేసి,
తాము చేసిన చట్టాలను తామే ఉల్లంఘిస్తూ
చూచీ చూడనట్లు వూరుకునే
బేఫర్వా ప్రియంభావుకులపై
విరుచుకు పడదామని వుంది
ఆ కులం బలం ధనం గల అసామాన్యులు
ఆ ప్రజా ప్రతినిధులు
మేధావులో మేతావులో అయిన ఆ పరాన్నభుక్కులు
వాగ్దానాల పునాదిరాళ్ళ సాక్షిగా
ప్రజాధనంతో తాము పోషిస్తూన్న గూండాల రౌడీల సాక్ష్యంగా
సమర్థంగా, సతార్కికంగా
సామాన్య ప్రజానీకం గూడా తోడు దొంగలే, అని -
నిరూపించినపుడు
నేను నోరెత్తలేకపోయాను

*　　*　　*

ఇంకేమని వ్రాయను తమ్ముడూ,
అడుగు బయట పెడితే కనిపించే ప్రతి దృశ్యమూ,
వినిపించే ప్రతి వాక్యమూ
మానభంగాల సాక్షిగా బ్రాందీషాపుల సాక్షిగా
సోమరిపోతులు అయిన కులమతగురువుల సాక్షిగా
బాల్యావస్థ యెరుగని బాల కార్మికుల సాక్షిగా
క్షణ క్షణం పెరుగుగుతున్న ధరల చూచి -
భవిష్యత్తులో సుఖజీవితాల కలలు కంటూ
నిత్యావసర వస్తువుల గూడా - ఆఖరికి కాస్త పాలుగూడా -
కొనలేని దుస్థితిలో నిర్వేదం పొందుతున్న
నిర్భాగ్యుల సాక్షిగా
నా గుండెలు మండిపోయి
దహనజ్వాలలు కళ్ళల్లో చిమ్మి రేగగా
రక్తం వేడెక్కి, నరాలు బిగిసి,
కలం యీటెతో ఒక దెబ్బ వేశారు
ఠపీమన్న శబ్దంతో కళ్ళు తెరిచి చూశాను
ఇది కలా? నిజమా?
పైదంతా కల!!
కలం కొసను తగులుకొనివున్న దినపత్రికనిండా
వోడుతున్న కొండంత రక్తచారికలు మాత్రం
నిజం!
నిజం!
ఇది ఆగేదెలా?

డాక్టర్ ముక్తేవి భారతి

# ఊయల

ఊయల ఊగుతోంది
పాపతో పూసులాడుతోంది
వెలుగు నీడలమధ్య అమ్మ మనసు
ఊగిసలాడుతోంది.
ఊయల ఊగుతోంది.

మరో ఆడపిల్ల- పెదవి విరుస్తున్న పెద్దమ్మ
ఇక నీ పని సరి- వెక్కిరిస్తున్న చిన్నమ్మ
గొంతులు చెవిలో గింగురుమంటుంటే
పచ్చి బాలెంత పల్చని చెక్కిళ్ళలో తళతళలు
కన్నీటిపొరల మిలమిలలు!
ఊయల ఊగుతోంది
పాపతో ఊసులాడుతోంది.

ఊపు ఆగింది
పాప మూతి విప్పింది
కళ్ళు చిట్లించింది
గొంతు సవరించింది
అమ్మ వెచ్చటి రొమ్ముకు హత్తుకు మళ్ళీ ఒత్తిగిల్లింది.
ఊయల ఊగుతోంది
అమ్మ మనసు వెలుగు నీడల మధ్య ఊగిసలాడుతోంది.

అమ్మా....అమ్మా
గుండె గొంతుకలో కొట్లాడింది
నేనే- ఊయలలో పసిగుడ్డుని
పొత్తిళ్ళలో పసిబిడ్డని-నేనే!!
నల్లని గుడ్లలోంచి భాషకందని భావం
అందకుండా పరుగుతీస్తోంది
పాప చూపులు చదవటం రాని అమ్మ మనసు
ఆత్రంగా ఎదురుచూస్తోంది.
అమ్మా....నేనే....నేనే
అది పిలుపో....అమృతపు చినుకో!
అమ్మ అంతరంగ తరంగం
పొర్లిపొర్లి పొంగింది.
ఊయల ఊగుతోంది
పాపతో ఊసులాడుతోంది.

ఆడ, మగ సృష్టి కవసరం
అమ్మ ప్రేమ వృష్టి కవసరమా?
సమాధానం కోసం అమ్మ ఎటో చూస్తోంది!
కొడుకు లేక నరకంలో పడతావా
ఆ కొడుకే నరకం తెస్తే
సమాధానం కోసం అమ్మ అటు చూస్తోంది.!
ఒక్కమాట చెప్పు -
ఒక రౌడీ రంగయ్యకి,
ఒక బండ రామయ్యకి,
ఒక దుండగీడు దానయ్యకి అమ్మ కావడం కన్నా
నాకు అమ్మవి కావటంలో ఆనందం లేదా!!
అమ్మ అటు ఇటు ఎటో ఎటో చూస్తోంది
చీకటిదారి వెంట ఎటో
కారడివి మధ్యలో ఎటో
అగ్నిజ్వాలమధ్య హాహాకారంలా
అమ్మ ఉక్కిరి బిక్కిరవుతోంది

ఊయల ఊసులోంది
పాపతో ఊగులాడుతోంది
ఇప్పుడు నిజం చెప్పు-
హాస్పటల్‌లో డాక్టరమ్మని
బడిలో పంతులమ్మని
కోర్టులో వకీలమ్మని చూసినపుడు
ఏమనిపించిందో నిజం చెప్పు!
వాళ్ళల్లో నేనొకతె కావాలని, కదూ! నిజం చెప్పు!!
అమ్మ పెదాలపై చిన్న నవ్వు తళుక్కున మెరిసి,
మరుక్షణంలో మాయమయింది
ముఖాన చిరు చెమటలు తుడుచుకుంటూ
ఊయలతొట్టిలోకి వంగి, వంగి చూసింది.
ఓ పక్క ఝాన్సీరాణి అట,
మరోపక్క మగువ మాంచాలట,
అంతలో, ఇంకోపక్క రూపకన్వర్
మరింతలో ఉరేసుకున్న ముగ్గురక్కచెల్లెళ్ళు
అమ్మ కళ్ళు గట్టిగా మూసుకుంది
ఆ బొమ్మలు మూకీసినిమాలా కళ్ళముందే
కదులుతున్నాయ్ ఉయ్యాల తొట్టిలో
ఊయల ఊగుతోంది -
అమ్మా....పాప గొంతులో పంచదార చిలుకలు
అమ్మా....పాప గొంతులో కోయిల కులుకులు
అమ్మ కళ్ళు తెరిచి అటు చూసింది
నా అడుగులకి అరిసెలు పంచద్దు
నా పలుకులకి చిలుకలు పెట్టదు
నాకు పట్టుపరికిణీలు వద్దు
వట్టాగొలుసులూ వద్దు
కాసులపేర్లూ వద్దు, గజ్జెల వడ్డాణాలు వద్దు
ఒక్కటే విన్నపం, ఒక్కటే కోరిక!!

నా కళ్ళతో చూడనీ
నా కాళ్ళతో నడవనీ
నా మనసుతో పెరగనీ
నా మెదడుతో ఆలోచించనీ
అప్పుడు
నేను అమ్మనౌతాను
ముగురమ్మల మూలపుటమ్మనౌతాను
వ్యక్తినౌతాను, శక్తినౌతాను
నన్ను, నన్నుగా బతకనీ!!
పాప కాలి బొటనవేలు నోట పెట్టుకుంటూ
కిలకిలా నవ్వింది,
గలగలా నవ్వింది.
అమ్మ మనసు వెలుగుదారివైపు పరుగుతీసింది.
అమ్మ మనసు ఆవేశపుటంచులవైపు పరుగుతీసింది
ఊయల ఊగుతోంది
పాపతో ఊసులాడుతోంది
ఊయల ఊగుతోంది.

డాక్టర్ ఎల్లూరి శివారెడ్డి

# పాపం దారి!

పాపం దారి దిక్కులు చూస్తున్నది
దిగాలుపడి, మనసు తల్లడిల్లి.
వస్తారనుకొన్న వాళ్ళు రానే లేదు
వేచిఉంది యుగాలుగా
చూచింది కళ్ళు కాయలు కాయగా.
నేస్తాన్నే మరచారు, తన మనసే విరచారు
అంతే విసురుగా రేగింది
ఉసురుసురనుకుంటూ.
వచ్చారు వద్దనుకున్న వాళ్ళు
రోషంగా మహాభీషణంగా
ఆ పాదాల సవ్వడి
ఘోరంగా మహాక్రూరంగా
అంతే పగులు వారింది దిగులుతో.

తాను వేచింది
తన్మయ స్పర్శకోసం
కోమలపాదముద్రకోసం.
తన ఆర్ద్రాంతఃకరణంలో
రామచరణంలా
అమృతకిరణంలా
చేతన కలిగించే
మెత్తనిచిత్తం కోసం.
భరింపలేని పదఘట్టన యాతన
తొలగేవరకు తప్పదు
తన అనంత తపన.
జడమైనా నిలువంతా పులకించేవరకు
వేచి ఉంటుంది ఆ స్పందన కొరకు.
కాదిది వట్టిదారి
నిలువెల్లా కాళ్ళున్న చైతన్యలహరి.

డి.ఎ.ఎల్.ఎన్. మూర్తి

# ప్రొద్దున్నే పేపరు

భక్తిరంజని దేవులపల్లి వారి
మధుర మంజులమౌ గేయ మాలికలను
భక్తి ప్రేమయు పరవశత్వంబు గలుగ
విని ప్రశాంత చిత్తుడనైన వేళయందు 1

బాంబుపడ్డ రీతి పడినది పత్రిక
పేపరతను విసరి వేసినంత
సైకిలాపకుండ చక్రి చక్రమొ రామ
బాణమట్లు వేయు ప్రజ్ఞ తనది 2

తెరచితిని పేపరప్పుడు
జరిగిన వింతలను ముఖ్య సంగతులెల్లన్
ఎరిగెడు కౌతూహలమున -
కరవయ్యెన్ శాంతి, మనసు కలవర పడియెన్ 3

పంజాబు మిలిటెంట్సు పగలే అమాయక
జన సమూహము కాల్చి చంపినట్లు
ఉద్రిక్తతను ఉన్నతోద్యోగి కిడ్నాపు
గావించు రేడికల్స్ ఘాతకములు
అంతరిక్షాన ప్లేన్ హైజాకు జేసి గొం
తెమ్మ కోర్కెలు పెక్కు తెలిపినట్లు
దారిలో బస్సాపి ధనము బట్టలు నగల్
దోపిడీదారులు దోచినట్లు
బాంబు ప్రేలుడుచే రైలు పడినయట్లు
అబల అగ్నికి ఆహుతి అయినయట్లు
ఆత్మహత్యలు రేప్‌ల దురాగతాలు
పడవ నడి సముద్రమున మున్గు వార్తలున్న 4

పదవిలో తనదు నిర్వాకంబు మరచుచు
ఈ ప్రభుత్వమును దుమ్మెత్తి పోయు
దేశ విదేశా లదేపనిగ తిరిగి
పొదుపు చేయుడటంచు బుద్ధి చెప్పు
గంపెడు బిడ్డలు గల మంత్రి వల్లించు
ఫామిలీ ప్లానింగు పాఠములను
తన పార్టిలో గొప్పతనము పేర్కొనలేక
ఇతరుల దోషాల నెంచు నెపుడు
ఫ్యాను లైట్ లేక రాత్రులు వ్యర్థమగును
బందు స్ట్రైకుల చదువుల వ్యవధి పెరుగు
గంటలైన "క్యూ" లో నిల్వగలరు ప్రజలు
మరచితిమి పూర్తిగాను సమయము విలువ 5

నదులు తీరాలు దాటు సంద్రములు పొంగు
పలు ప్రదేశాల భూకంపములును కలుగు
అగ్ని పర్వతము పగులు - ఆగ్రహించె
నేమొ భూమాత బిడ్డల నేరములకు 6

ఈ కబుర్లతొ మనసు చీకాకు పడెను
"నిదుర లేచిన వెంటనే చదువరాదు
పత్రిక"ను నాదు శ్రీమతి పలుకు నయమొ?
తిరిగి తలచితి కృష్ణశాస్త్రి పలుకులను
"మనిషి భయము విడనాడుటే గాంధీహితం!"
"మనిషి మారితే కోవెలగ గాంధీతనం!"

హరి చంద్రశేఖర్

# సంతప్తాంతరంగాన్నై....

నీ నైరూప్య నిశీధి
గుహాంతర్భాగంలో
ఊపిరి సల్పని ఏ వెతల
పాల్జేశావో కాని
సరిహద్దు దాటి కాందిశీకుణ్ణై
ఇటు వచ్చాను
ఊపిరి పీల్చుకునేందుకు.

ఇక్కడా నీ సామంతమే
రాజ్యమేలుతోందని
ఇక్కడా నిన్ను మించిన నిర్దయు
లున్నారని తెలిసి
ఊపిరి ఆగిపోతోంది

అదను తప్పి పడిన
మరో చినుకు మరో చినుకు
పారావారంలో కలుస్తున్నాయి
రాలిన మరో ఆకు మరో ఆకు
వారాహి కౌగిట్లో కరిగిపోతున్నాయి
ఆత్మను హత్యచేసి
మరో పాత్ర మరో పాత్ర
వరారౌతున్నాయి

చుట్టూ చూసుకుంటున్న తలుపులు
మధ్యనపడి నలుగుతున్న గొంతుక
తలుపులు తెరవనివ్వు
తలపులు పారనివ్వు
ఇసుక విత్తనాలు
మొలకెత్తనివ్వు
ఇక్కడ విక్రయానికి పెట్టిన
మా కాలసూత్ర ముఖపత్రాల్ని
రెండే రెండు ముళ్ళతో కొలిచి
ముక్కలు ముక్కలుగా కొనుక్కుపోతున్నారు
వారి ఇసుక గడియారపు వెండిగుడ్లు
ఇసుక రేణువుల్ని కార్చేందుకు
మా గాజు గుప్పెటి శూన్యాన్ని
పదిలపరుస్తున్నారు

అదను మీద వర్షం కరువై
మా మానసాంతర భావగోళం నిండా
కాలకీలం పరచుకుంటోంది

జి. కుమారస్వామి నాయుడు

# అద్దం

అద్దం యథార్థవాది
అద్దం వాస్తవవాది
అద్దం హేతువాది
అద్దం న్యాయవాది
అద్దం సహృదయ సద్విమర్శకుడు
వికృతాకారంలో
అగ్రశ్రేణికి చెందిన నీ జిడ్డుముఖం
అద్దంలో అందంగా కనిపించలేదని
అద్దాన్ని ముక్కలుచేస్తే
నీ విక్రియ
ప్రతి ముక్కలోనూ ప్రతిబింబిస్తూ
వేనోళ్ళా లోకానికి చాటి చెబుతుంది
సహృదయ క్షేత్రాల్లో నాటుతుంది
అద్దం మీద దౌర్జన్యం చేయకు
దుర్మార్గుడుగా ముద్రవేసుకోకు
కొండ అద్దంలో కొంచెమై కనిపించుననుట
పాతమాట
అద్దంలో
గోరంతలను కొండంతలుగ చూపించుట
నేటి ఆట
బ్రతక నేర్చిన సుత్తివీరులు నిర్మించుకొన్న బాట
అధిక సంఖ్యాకులకు అంటుకొన్న
కొత్త తీట

భూతాలకు వ్యర్థ జీమూతాలకు
దివాంధాలకు
కూపస్థ మండూకాలకు
గుంటనక్కలకు
అద్దమంటే చచ్చేంత భయం
అద్దాన్ని బద్దలుకొట్టి
వాస్తవాలను వక్రీకరించాలనుకోవటం
అనాలోచితం
ఒక అద్ద అంతరిస్తే
వందలాది అద్దాలు అవతరిస్తాయి.

# విషాద విషయ సందోహాలు

అసలు సిసలైన వెండిముద్దలా చంద్రుడు
కవికి కప్పిన శాలువలా అతనిచుట్టూ ఓ మేఘం
చుట్టూ మూగిన అభిమానుల్లా నక్షత్రాలు
ఆనంద బాష్పాలతో స్వాగితిస్తున్నట్లున్న పుష్పాలు
మూకుడులో ఉన్న ముత్యాల్లా భూమిపై
తుషారబిందు సందోహం
వందిమాగధుల్లా ఘోషిస్తున్న సముద్రాలు
అందమైన అనుభూతుల్లా
పిల్ల తెమ్మెర సమూహాలు
ఈ సుందర దృశ్యచిత్రాన్ని
మనోఫలకంపై చిత్రించుకొని
మౌనికి ప్రతిధ్వనిలా
ఆనందానికి లక్షణావృత్తిలా
జీవించాలనుకొంటే
ఎన్నో విషాదవిషయ సందోహాలు
సంతోష విఘటనాసంధి సంఘటనలు
కన్నీటితో అభిషేకం చేసుకొన్న
లక్షల అక్షర అనుభవాలు.

చొప్పకట్ల చంద్రమౌళి

# జండా విలవిలా కొట్టుకుంటోంది

పచ్చదనమంతా పైపైవారికే అందుతున్నందుకూ
మధ్యతరగతి బతుకుల్లో నల్లని చీకట్లు నిండి
మొహాలు తెల్లబోయి వెలవెలాబోతున్నందుకూ
పచ్చదనం నోచని అడుగు బడుగు కంటిలో
ఎర్రదనం కొర్రాయిలా వెలుగుతున్నందుకూ— ॥జండా॥

జండా కర్రకు ఒరిగించిన గాంధీగారి కంట్లో
కుంకుమకారం జల్లి,
హింసలూ, దౌర్జన్యాలూ సాగించే
గుండాలూ, స్వార్థపరులైన ధూర్తులూ చేసే
మారణహోమయజ్ఞంలో
యూపస్తంభానికి కట్టివేసిన
బలిపశువులా, హింసను తప్పించుకోవడానికి
గింజుకుంటూ, లాగుకుంటూ— ॥జండా॥

న్యాయాన్ని, ధర్మాన్ని మూటగట్టి
ఉరిబెట్టిన తాళ్ళను, తెగలాగినప్పుడు
తాళలేక
కన్నీటి పుష్పబాష్పాలను రాలుస్తూ— ॥జండా॥

సెల్ఫ్ చెడిన బస్సువోలె
అధికారం ఓడుతుంటె
సైలెన్సర్ లేనిగుండె
సమస్యలను పాడుతుంటే— ॥జండా॥

లెన్సులు చూపెట్టలేని
సెన్సులు పసిగట్టలేని
న్యూసెన్సులు విజృంభించి
న్యూలైపుల చెరుస్తుంటే— ॥జండా॥

రఘుశ్రీ

# (అ)రెస్ట్

అతడు ఆమె కలిసారు
అత డెళ్ళిపోయాడు
అగ్గిని సిగరెట్‌తో బుగ్గిపాలు చేసేసి.
ఆమె వెళ్ళిపోయింది
పొగచూరిన గూటి దీపాన్ని ప్రక్కకు తీసేసి
గెల్చిన రేసు గుఱ్ఱపు జాకీలా
అతడి వదనంలో
అత్యంత పర్యాప్త పరవశ ఛాయలు
ఆమె ఉదరంలో
పంచభూతాలు
రంగులరాట్నం మాడుతున్నట్లు
అనుభూతి ప్రదర ప్రకంపనలు
వాషింగ్‌మిషన్‌లో మురిగ్గుడ్డలా
యావత్ శరీరంలో స్కానింగ్‌మయావర్తన
చయా చయ క్రియలు
అతడు హాస్పిటల్ లాన్స్‌లో సాధువులా రిలాక్సయాడు.
ఆమె ఎమార్షన్ హాల్లో తాపసిలా రిలాక్సయింది.
పూషుడి పునరాగమన పూర్వమే
నోరులేని నగరం ప్రత్యక్ష సాక్షిగా
ఆకాశంలో నక్షత్రాల పతాక శీర్షిక....
మెహిందీ చాందినీ బాహు బంధాల్లో అతడరెస్ట్.
హుస్సేన్‌సాగర్ బాహు కెరటాల్లో ఆమె (అ)రెస్ట్,
పారేపేటిలోకి పండిన బాదంఆకు రాలిపడ్డట్లు
తూర్పు తాణాలోంచి
మార్తాండం ఎర్రటోపీ సవరించుకొని
హడావిడిగా ఊడిపడ్డాడు లోకంపైకి.
జరిగిందేమిటో పరిశోధించడానికి.
"మామూలు" వృత్తిలో భాగంగా!!

శివపురం శైలజ

# ఈ కాలం కవి

అక్షరాలన్నీ అలిగి వెళ్ళాయి
నాతో సహకరించనని
నేను చేసిన పాపమేంటో
తెల్లకాగితం కూడా తెలియదు పొమ్మంది
కలాన్ని అడిగాను
ఏమీ తెలియదని
అడ్డంగా తల ఊపింది
పాఠకుడిని ప్రార్థించాను
వాడు కాస్త జాలిగా చూసి అయ్యో, ....
నువ్వీ కాలం 'కవి'వి కదా అన్నాడు
అప్పు డనిపించింది నాకు
అక్షరాలకు సహితం అందని
సమస్యలను సృష్టించే 'మనిషి'
ఎంత శక్తిమంతుడు సుమా అని
అనుభూతుల్ని ఆవిరి చేసే అహంభావి
సాటివాడిని సయితం సహించని స్వార్థపరుడు
ఇక్కడ (ఎవరి గోడు వాడిదే) ఎవరి నీతి వారిదే
ఎవరి రీతి వారిదే
అందుకే అక్షరాలు అలిగాయి
నన్ను సహితం విసుక్కున్నాయి
ఘనీభవించిన సంస్కృతిలో
గత వైభవాన్ని వల్లించొద్దన్నాయి

కమ్మని కావ్యాల నిండా హింసలను
అతి స్వేచ్ఛ ననుభవించే మానవుణ్ని వర్ణించొద్దని
అక్షరాలన్నీ గోలెడుతున్నాయి
మమ్మ అపవిత్రులను చేయొద్దంటూ
దీనంగా వేడుకొంటున్నాయి
సమాజంలో విలువలు పెరిగినపుడు
మనిషి మనిషి మధ్యన మానవత్వం నిండినపుడు
ఓ ప్రేమామృతధారగా
గుండెలనిండా నిలిచే అనుభూతిగా
ఓ ఎంకి పాటగా
ఓ కృష్ణశాస్త్రి గీతిగా
నార్ల మాటగా నీ ముందు
నిలుస్తామని మరి మరి చెప్పివెళ్ళాయి అక్షరాలు.

## చిల్లర భవానీదేవి

# వజ్ర పుష్పం

విశ్వ దేహంలో నరనరానా నిండినా
దృశ్యం కాలేని గాలి వృక్షంలా
నిలువెత్తు దేహాన్ని ఆవరించిన ఊహాతంత్రి
అనంతకోటి రాగ మాలికలను
అద్భుత కావ్యంలా ఆలపిస్తుంది
ప్రేమపల్లకీలో త్యాగ పేటికలు మోస్తూ
ఆశాకర్పూరాలను భగ్నశిల్పాలకు హారతిస్తుంది
కంటిపాపలకు మెరుపుదృశ్యాలు హత్తుకుంటూ
వియోగ రాత్రిలా చెలరేగిపోతుంది
పూరేకులపై రాలిన హింసాబిందువుల్లో
నాగరికత నిట్టూర్చే మృగత్వాన్ని శ్వాసిస్తుంది
శిశిరపు సందిట్లో చిక్కిన చిగురు పావల కన్నుల్లో
అల్లాడిపోతున్న మానవత్వాన్ని చూసి ఆర్ద్రమౌతుంది
అహంకార మేధను మమతాసూత్రంతో ముడివేస్తూ
తమోగాయాలకు ఉదయలేపనాన్ని అద్దుతుంది
చెమటతో చేసిన ఆకలిపళ్ళెంలో
మట్టిముద్దలు చూసి మూల్గుతుంది
నిలువెల్లా జ్వలించే ఊహాదీపమౌతుంది
అదృశ్యంగా విరిసే వజ్రపుష్పమౌతుంది
అవిచ్ఛిన్నంగా సాగే వెన్నెలదార మౌతుంది
నిరంతర స్పందనాశిల్పమై నాలో నర్తిస్తుంది
నవ్య భావనాతరంగతల్పమై నన్ను మోస్తుంది.

డా॥ వడ్లూరి ఆంజనేయులు

# ప్రతిజ్ఞ

ఇది నా భారతదేశము
ఇదె నా కిల స్వర్గసీమ యాదేశమునన్
ముదమున జనియించి పరమ
పదమందుదె భాగ్యమనుచు భావింతు మదిన్.

పుట్టిన నిందె బుట్టెదను మోక్షము బొందిన నిందె బొందెదన్
నెట్టన బ్రతుకీడ్చినను నేమముదప్పక నిందె యీడ్చెదన్
ఎట్టులనైన కాయ మిక యిద్దర గూలుట సిద్ధమే కదా
గట్టిగ భారతాంబ పదకంజయుగమ్ముల రాలిపోయెదన్.

జననియు జన్మభూమియును స్వర్గము కన్న గరీయ మంచు తా
ననియె కకుత్స్థ వంశ ఘనవార్నిధి సోముడు రాఘవుండు ఆ
యనఘుని దివ్యవాక్కులను ఔదల దాలిచి మాతృభూమిపై
ననయము గౌరవమ్ము నభిమానము నాదర మొప్పనుండెదన్.

సకల కళా నిధానయగు సాహితి నౌదలదాల్చి లోకపున్
సుఖము లశాశ్వతమ్మనెడు సూక్తి హృదంతరమందు నిల్పి నే
ప్రకటిత భక్తి యోగమున భారతమాత పదార్చనంబునన్
సకలము నొప్పగించి జనజాగృతికై శ్రమియింతు నిచ్చటన్.

అఖిల వసుంధరా వలయమందు గరిష్ఠము దివ్యభారతం
బొక ఘన వైభవం బలరు నుత్తమ ఖండము స్వర్గసీమ శ్రీ
లకు నిది పుట్టినిల్లు కతలందు విశిష్టము వేదభూమి తా
త్త్వికులకు ధర్మమూర్తులకు వీరుల కిద్ది పవిత్ర భూమియౌ.

గంటి లక్ష్మీనారాయణమూర్తి

# వెండివెలుగులు

యువభారతీ నీకిదే
సాహిత్యకళారజత నీరాజనంబు
విశ్వనాధంగారి సంకల్పశక్తి
కృష్ణమూర్తిగారి నిస్వార్థ భక్తి
సుబ్రహ్మణ్యంగారి పాండిత్య దీప్తి
రూపుదాల్చిన నీవు వాగ్దేవిమూర్తి — యువభారతీ!

అలముకొన్నటువంటి అజ్ఞానతిమిరమును
అంతరింపగను అవతరించిన నీవు
ఓ భారతీదేవి అవతారమూర్తి
శతాధిక గ్రంథములు శతవిధంబులుగ
నీ రూపురేఖలే తీర్చిదిద్దగను
ఆంధ్రభూమిని వెలసిన అపురూపమూర్తి — యువభారతీ!

భారతీభూషణుల గళనిగళ దీప్తి
సాహితీ బంధువుల సంఘటిత శక్తి
సాహితీవేత్తల సంయుక్త ధీయుక్తి
పోషించి పాలించి వ్యాప్తి చేసిన కీర్తి
రజతకాంతులు చింది రాజిల్లె నీ మూర్తి — యువభారతీ!

జనరంజకుడైన జనార్దను డొకడు
కవి జనరంజకుడైన నారాయణు డొకడు
ఇరువంకలూ జేరి నీ దివ్య గళమందు
వైజయంతిని వేసి వైభవోపేతముగ
వెండి పండుగజేయు శుభసమయమందు — యువభారతీ!

కవిపండిత వేదవిదులు
"నాస్తితేషాంయశఃకాయే
జరామరణజంభయంబ"ని
ఆమోదాశీస్సులందించు వేళ
యువభారతీ నీకిదే
సాహిత్య కళారజత నీరాజనంబు.

నాయికోటి శివప్రసాద్

# పరివర్తనోగాది

వచ్చేసింది ఉగాది పర్వదినం
ప్రకృతి కావ్యంలో ఒక సుందర పుట నిండిపోయింది
మనోహరమైన మరోపుట మన కందివ్వటాన్కి
క్రొత్త ఆశను నింపుకొని. క్రొంగొత్త భావాల నిడుకొని
గత వత్సరం చేదు అనుభవాలు మళ్ళీ తనలో రానీయనని
అందమయిన భావాలు నింపుకొని
మనోహర ప్రకృతితో కలిసి వచ్చింది ఉగాది
గత వత్సరపు రక్తపు మరకలు, కఠినాత్ముల పదఘట్టనలకు
తనలో తావివ్వనని శపథంచేసి మరీ వచ్చింది
కరకు హృదయాల పద ఘట్టనచే
నలిగిన బ్రతుకుల విరిగిన మనసులకు
తన స్నేహ హస్తం అందించి చేయూత నివ్వాలని
ప్రపంచ రూప రేఖల్ని మార్చేసే
మూర్ఖపు మనుష్లలో పరివర్తన తేవాలని
అమానుషత్వం నుంచి మానుషత్వంలోకి మార్చాలని
అజ్ఞానినుంచి సుజ్ఞానిని తయారు చేయాలని
పరువెత్తే ఊహలతో పరుగు పరుగున వచ్చింది
మూర్తీభవించిన మంచి మనసు తిని
మంచి వాసన పరిమళించే సుగంధ ప్రకృతితో కలిసి
అనూహ్యంగా నడచి వచ్చింది ఉగాది
తల్లిని దరిచేరే పిల్ల మాదిరిగా
ప్రకృతి ఒడిలో ఉగాది చేరింది
ప్రళయాన్ని ప్రకృతి బీభత్సాన్ని సృష్టించి
ప్రజా జీవితాన్ని స్తంభించిన
ప్రజాపతికి వీడ్కోలు చెపుతూ
సుమనోహర కీర్తి చంద్రికలు దాల్చాలని
మానావాభ్యుదయ వీచికల మధ్య
పరుగులిడుతూ వస్తున్న అంగీరసకు
నా అక్షరజ్యోతి!

# నిరీక్షణ

గుండెలు బద్దలవుతున్నాయ్
మానవత్వం మంటకలసి
అమానుషత్వం పెచ్చుపెరిగి
మా గుండెలను పిండి చేసేస్తున్నాయి

కర్కశ హృదయాల పదఘట్టనచే
కమనీయ హృదయాల భయాందోళనచే
దిక్కులేక బిక్కు బిక్కుమనిచూసే
ఆ కోమల హృదయాల ఘోష వినలేక
గుండెలు బద్దలవుతున్నాయ్.

ఆకలితో అలమటించు అన్నార్తుల కేకలు
మానవవారణ్యంలో మానవత్వ అరణ్యారోదనలు
విచ్చలవిడిగా జరిగే దౌర్జన్యాలు చూడలేక
నా హృదయం ఘోషిస్తుంది

నా హృదయం రోదిస్తుంది
అన్యాయం చూడలేక
అగచాట్లను వినలేక
దౌర్జన్యం కనలేక
దౌర్భాగ్యం సహించలేక
నా హృదయం విలపిస్తుంది

తమస్సులోంచి ఉషస్సులోకి
అమానుషత్వం నుంచి మానవత్వం లోకి
అజ్ఞానినుంచి వచ్చే సుజ్ఞానికోసం
నా హృదయం పరితపిస్తుంది.

# పట్టాలపై ప్రాణి

ఒక జీవి రైలుపట్టాలపై రాబోయే రైలుకోసం నిరీక్షిస్తున్నాడు
జీవితంపై నిరాశ కాబోలు అందుకే
అతను రాబోయే రైలుకోసం నిరీక్షిస్తున్నాడు
కళ్ళుమాత్రం రాబోయే రైలుకోసం ఎదురుచూస్తున్నాయి కాని
మస్తిష్కం గత స్మృతులతో నిండిపోయింది
గతజీవనమధురస్మృతులు ఒక్కొక్కటే మననం చేసుకుంటున్నాడు
తన తల్లి నెయ్యి కలిపి తినిపించిన అన్నం గోరుముద్దలు
స్నేహితులతో కలసి ఆడిన కోతి కొమ్మచ్చి ఆటలు
మోట బావిలో ఈతకై వెళ్ళి పైనుంచి దూకిన సాహసకృత్యాలు
కళాశాలలో స్నేహితులతో కలిసి తిరిగిన మధుర ఘట్టాలు
గత 15 ఏళ్ళుగా భార్యతో పెంచుకున్న అనుబంధం
12 సం॥ తన పాప నగుమోము తన కళ్ళముందు మెదిలింది
తాను ఈనాడు పట్టాలపై రాబోయే రైలుకోసం నిరీక్షిస్తున్నాడు
అంతలోనే దూరంగా రైలు వస్తున్న శబ్దం వినవస్తుంది
అతనిలో సంతోషానికి హద్దులు లేవు
తన నిరీక్షణ ఫలించబోతుంది
రైలు సమీపిస్తుంది దగ్గరగా వచ్చేసింది
మరింత చేరువైంది
రెండేళ్ళ తరువాత తనవారిని చూస్తానన్న ఆనందం
ఆ రైలు రాకతో నిజం కాబోతుంది
రైలు పట్టాలపై కూర్చున్న అతను ఒక్క ఉదుటున
ప్లాట్‌ఫాం పైకి చేరుకున్నాడు
అతనొక
జీవన బాటసారి.

# వినూత్నొగాది

వత్సరం నవ నూతన వత్సరం
ప్రజాపతికి పరదా వేస్తూ
ఆత్మీ యతాభావంతో అంగీరస
కాలగమనం లోకి ఒక వత్సరానికి వీడ్కోలు చెపుతూ
వినూత్నోత్సాహంతో పరుగులు తీస్తూ వచ్చేసింది
మధురంగా మన మదిలో నిలచిపోవాలని
యువతను మేల్కొల్పి నవ యువతగా మార్చాలని
నూతన నవ నూతన వత్సర ఆగమనం
తన శుభాగమనానికి సంకేతంగా
నిశితో ఉన్న యువతను ఉషస్సులోకి తోడ్కొనిపోవటానికి
వినూత్నొగాది ఆగమనం
నవ్వులతో సిరి మువ్వలతో
చిగురించే చిగురాకులతో
లేతమావిళ్ళ చిగుళ్ళ ఉగాది
వేపపూల పరువాల ఉగాది
జీవితం కష్ట-సుఖాలమయం
అందుకే చేదు తీపుల సంగమ పచ్చడి
పరువాల హాయలు నింపి పసిడి పిందెలతోని
మురిపాలు నింపుకొని ముంగిళ్ళలోకి
ముత్తైదు భంగిమన తరలి వచ్చింది
నవ్వుల ఉగాది సిరిమువ్వల ఉగాది
జీవితం మూడుపూవులు ఆరుకాయలు కావాలని
వేపపూలు మామిడిపిందెలతోని
ముచ్చటగా మురిపాలు ఒలికిస్తూ వచ్చేసింది ఉగాది
ఇదిగో ఇదే నీకు నా అక్షర సుమార్చన.

కె. శ్యాంప్రసాదరావు

# నరమేధం!

మనిషిలో మానవత్వం నశించి
దానవత్వం తొంగిచూచిన వేళ
మనిషి జ్ఞానాంధకారంలో చిక్కుకొని
వివేకాన్ని నోల్పోయిన వేళ.

పైశాచిక ప్రవృత్తి కోరలు చాచి
నెత్తుటి స్నానం చేస్తూ,
నరమాంసాన్ని రుచిచూస్తోంది.

అరాచకం అర్రులు చాచి
తన బాహువుల్లో బంధించి
మానవత్వాన్ని మానభంగం చేస్తోంది.

రాక్షసత్వం రంకెలువేసి
కరాళ నృత్యం చేస్తూ,
మరణ మృదంగం మ్రోయిస్తోంది.

మతోన్మాదం పెచ్చరిల్లి
మానవతా జ్యోతిని ఆర్పేస్తూ,
మృత్యుకుహరంలోకి తోసేస్తోంది.

నర మృగాలు చేసే మారణహోమంలో
మృత్యుఘోషలతో మానవతని బలిచేస్తోంది.

# బాల్యం శాపమా?

తుపాను తాకిడికి చెల్లాచెదురైన
ప్రకృతిలా ఆ పసివాడి జీవితం
చిరుగుపాకలా ఆ అంగీ
బొత్తాలూడిన చెడ్డీ

ఆ ముఖంలో ఆత్రం
ఆ కళ్ళలో ఆర్ద్రం
దారిలో పోయేవారికాళ్ళను
తన చేతులతో పట్టేసి.... ...

కోపగించిన బాటసారి
తన్నేసినా తప్పదని భరిస్తాడు
ఎవరైన విసిరేస్తే నాణెం
అందుకొని, ఎవరెస్ట్ నెక్కిన
ఆనందాన్ని పొందుతాడు. ఆపై,

సాగివచ్చే కాళ్ళకై ఎదురుచూడటం
ఏడేళ్లైనా దాటని ఆ పసివాని బాల్యం
నడిబజారులో నిర్దాక్షిణ్యంగా బలైపోతోంది
ఇలా,
ఈ దేశంలో ఎందరి బాలల బాల్యం
నడి బజారులో తాకట్టు పెట్టబడుతున్నదో
దానికి కారణం—
జన్మించిన బాలుడా?
కఠిన హృదయాలా?
ఆకలి మంటలా?

## ఎడారి రోదన!

చమురుకై నెత్తురు పొంగింది.
నెత్తురు చమురై పారింది.
జీవితాలు చమురు జ్వాలలై నింగికెగిశాయి.
ప్రాణాలు కారుమేఘాలై ఆకాశాన్ని క్రమ్మాయి.
క్షతగాత్రుల మూల్గులు చెవుల్ని బ్రద్దలు చేస్తున్నవి
హృదయమున్నవారి హృదయాల్ని ద్రవింపజేస్తున్నవి

మృత్యువు క్షిపణిలా దూసుకువచ్చి-
జీవితమనే ఎడారిలో విస్ఫోటం చెందగా,
ప్రాణం చేసిన రోదన, ఎడారి రోదన!

పంతాలు కాదు కావాల్సిందిప్పుడు
తమ పంతాలకి ఎన్ని జీవితాలు పతనమయ్యాయని
చితికిన జీవితాలకు చేదోడు కావాలి
భారమైన గుండెలకు ఓదార్పు కావాలి
కరకురాతి గుండెల్లో, ద్వేషం హిమమై కరగాలి
ప్రేమను పంచే ఔదార్యం రావాలి.
శాంతి ఆయుధం ధరించే సైనికులు కావాలి.
పేల్చిన క్షిపణులెన్నని కాదు, పేలిన జీవితాలెన్నని.
యుద్ధభేరి కాదు మ్రోగాల్సిందిప్పుడు
స్నేహభావంతో పిలుపునిచ్చే శాంతినినాదాలు!

## ప్రార్థన !

నా హృదయం విశ్వమంత విశాలం
నా హృదయం భారతదేశమంత సుందరం
నా హృదయంలో—

'ప్రేమ' ఆకాశమంత సువిశాలం
హిమాలయాలంత చల్లన
ఆలీవ్ ఆకులంత మెత్తన
కపోతమంత నిర్మలం

నా హృదయమిప్పుడు—
కోవెలలో ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తోంది
మసీద్‌లో అల్లాని వేడుతోంది
చర్చిలో క్రీస్తుని స్తుతిస్తోంది
గురుద్వారాలో నానక్‌ని కీర్తిస్తోంది
ఈ మనిషికి వెన్నలాంటి మనసివ్వమని
ఆ మనసులో సాటివానికి చోటివ్వమని
మానవతని మేల్కొల్పమని
సౌభ్రాత్రం కల్గించమని.

## ధ్యానముద్ర!

మనసు ఋషిలా మారినప్పుడు
ప్రేమ వటవృక్ష మౌతుంది.
దిక్కు తోచక ఎడారిలో తిరిగే హృదయం
ఒయాసిస్‌లో చిక్కుకుంది.
దాహమంటే తెలియని నాకు
సేదతీర్చి, దరహాసం నేర్పింది.
నిశాగగనంలో మెరుస్తున్న తారక
కాంతి పుంజమై దారి చూపిస్తుంటే
అంతకన్నా కావాల్సిందేముంది?
ఉందో లేదో తెలియని—నాలో,
నాకూ ఓ హృదయముందని జ్ఞానోదయమైంది.
ఆలోచించక వెంటనే అది తారకకు ఇచ్చేశాను
నేనిప్పుడు హృదయం లేనివాణ్ణి కాను,
హృదయం తోడున్నవాణ్ణి.
నేనిప్పుడు కొమ్మకు చిక్కుకొని,
గింజుకొంటున్న గాలిపటాన్ని కాను.
సంసార సాగరంలో, సమస్యల సుడులలో
చిక్కుకొన్న సగటు మనిషిని కాను.
'ప్రేమ' అనే పవిత్ర యజ్ఞోపవీతాన్ని ధరించి,
మనస్సనే ప్రశాంత వనంలో
ధ్యానంలో వున్న మహర్షిని నేను!

జీడిగుంట సాయిబాబా

## ఆకారం శ్రీకారం

ప్రపంచమో, సృష్టి!
జగత్తుకో సూర్యుడు,
ఒక అవని, ఒక చల్లని మామ.
అది ప్రకృతి!
నా ప్రపంచంలో సృష్టి నీవె,
ఆయువు లైదూ, కలబోసి
నిలుపుకున్న కలల చెలీ,
నా ప్రాణం ప్రణవం, సర్వం నీవే,
నీ కోసం, నీ రాకకోసం
నీ పెదవుల మెరిసే హాసం, లాస్యం,
నాకోసం కావాలని
నిరీక్షిస్తూ, క్షణం క్షణం-
ఎన్ని పోగొట్టుకున్నానో, నీకేం తెలుసు!
ప్రపంచం, 'నీతో' పనిలేదన్నా
నువ్వు లేని జీవితం దుర్భరమని
ఈ రాబందుల కింకా తెలియలా!....
అయితేనేంలే, నీలోని శ్రీకారాన్ని 'వ' కార, 'ఇ' కారాలని
నా కోసం మోసుకొని, ఏ దిక్ దిగంతాలనున్నా-
వచ్చేయవూ....జాగు లేక, ఓ 'విశ్వకాంతీ!'....

## ఆగష్టు పదిహేను

ఆగష్టు పదిహేను....సమయం ఖచ్చితంగా తెలదుకానీ
అర్ధరాత్రి....ఎక్కడో....దూరంగా
జన ప్రభంజనంతో
భువి కదిలింది దివి అదిరింది

రవి అస్తమించని
తెల్ల దొరతనం, నిలువలేక
నీరు కారింది భారతావనిలో!
భరతజాతి హృదయం అగ్నిపర్వతమై
లావాల శూలాలు విసురుతుంటే
రెండు శతాబ్దాలు
మనల్ని విభజించి తాను పాలించుకొన్న
తెల్లదొరని.... మనం కలసి పడతాం నీ భరతం అంటే
భీరువై వెన్ను చూపాడు....
నువు కాల్చే ఒక తూటా, పది బాంబులుగా
పేలుస్తుంది మా హృదయం
ఖబడ్దార్! దమ్మంటే 'కాల్చ'మంటే
ఈ దేశం మీదంటూ
నే నెందుకు మీ కడ్డంటూ
బయటి కెళ్ళిపోయాడు
భళ్ళున తెల్లారకముందే
స్వాతంత్ర్యం మీ సొత్తని.

## సూర్యుడా!.... ఉదయించు

ఆరాత్రి పయనిస్తున్నా ఒంటరిగా
చుట్టూ కారుచీకటి, మరుభూమి, నిశ్శబ్దం,
రాజ్యమేలుతున్నాయి!
ఆ నిశ్శబ్దంలో.... దూరంనుండి
ఏవో ఆక్రందనలూ, ఆవేదనలూ
వినిపిస్తున్నాయి మనసును ముక్కలుచేస్తూ!
హఠాత్తుగా వెలుతురు.—
సలసల మండే గుండెలమంటలు
చితిమంటల్లా చిటపటమంటున్నాయి
పడబోయే ప్రాణానికి నాందిలా
రోదనలు మూల్గులు
ప్చ్.... నిరాశ నిస్స్స్స్పృహ!!

ఈ నిశ్శబ్దపు చీకటిలో
ఎన్ని గుండెల మంటలవేడిని చూశా,
అబ్బా.... ఎటుచూచినా,
దీనుల బాధలూ, ఆవేదన వేదనలే
కన్పిస్తున్నాయి నాకు!
ఈ చీకటి యిలాగే వుంటే - ఓహ్.... చాలా ప్రమాదం
అందుకే 'సూర్యుడా!' త్వరగా
ఉదయించు.... దీనుల జీవితాల్లో!

## 'ఏముందని?'

ఈ పున్నమి వెండి పాన్పుమీద,
మల్లెల సుగంధాల పల్లకీలో,
"చెలీ,"
నీ ఒడిలో ఒదిగి,
ఊహాతీరాలఅంచులపై
ఏవో మాటాడాలనీ, నీతో ఆట లాడాలనీ,
నా ఎద రోద చేస్తోంది, కానీ
నా ఆశలు తీర్చటానికి నీ విక్కడ లేవు కదూ!
ఆఁ....అన్నట్లూ
నీవు లేకపోతేనేం
నాలోని ప్రతి అణువూ నీతోనే నిండి
నీవు కాని నేను లేనుగా
నా ఎదపై సయ్యాటలాడి,
నాలో ఆశలు రగిల్చి, నిదర్శనాలు మిగిల్చి
నీవు వెళ్ళినా....
నేనా కవిని కాను కవితలల్లడానికి
కేవలం, మనిషిగా జన్మించిన పాపానికి
నాలో రగులుతున్న చితినబడి
గుండెను మండిస్తూ....నీ తలపులతో
కుమిలిపోవటం కన్న
చెలీ! చేయగలిగిం దేముంది?!

# అన్వేషణ

నేనో
కవినీ, విప్లవకవినీ
ఏమీ కాను
ఈ కుళ్ళుపట్టిన సమాజాన్ని
నా
కలంతోనో, కత్తితోనో
రూపు రేఖలు మార్చడానికి!
అయితే,
నేనూ ఓ మనిషినే, మామూలు మనిషిని,
అయినా
నా మనసుతోటి మానవత్వంతోటి
మార్చుస్తా నీ సమాజాన్ని
ప్రేమ పంచుతూ, మంచి పెంచుతూ.
మేలుకున్న మనిషిగా
వెదుకుతా, నల్గురిలో
మేలుకొనే మనుషులను
మేలుకునేటట్లు చేయటానికి
వికసించిన నవ సమాజ నిర్మాణం లక్ష్యమంటూ!

గన్నమరాజు సాయిబాబా

# పొదుపు

నిన్న లేదు
నేడు నిలువదు
రేపు ఉండదు
కేవలం కలలా
కరిగిపోతుంది
జీవితం అలలా
తరిగిపోతుంది.

వెలుగున్నప్పుడే
కలుగు పూడ్చుకో!
ఒంట్లో శక్తి యున్నప్పుడే
ఇంటి భద్రత చూసుకో
వ్యసనాలు మానుకో
సమస్యలు దాటుకో
గొప్పలు మనకు వద్దు
అప్పులు అసలే వద్దు
సంపాదన కాదు మేటి
ఖర్చులో అదుపే పొదుపుకు సాటి.

రాయి రాయి తీస్తే
కొండ లోయ అవుతుంది
ఆకు ఆకు దూస్తే
మానే మోడౌతుంది
చెలమలో బిందెడు
నీరు తోడితే బ్రహ్మానందం
చెమటంటిన రూకల ప్రోగు
దేశ భవితకు భాగ్యరాశి
కూడ పెట్టిన ధనం
కష్టాల్లో ఆదుకునే దైవం

అగ్గిపుల్ల, కట్టెపుల్ల
సబ్బుబిళ్ళ, కాగితం ముక్క
పగిలిన చెక్క కాదేదీ పొదుపు కనర్హం
అన్నీ పొదుపు కర్హం అది పాటిస్తే జీవితమంతా హర్షం.

## అందాల సుందరి

అందాల సుందరి
అనురాగం పందిరి
నిను నా రాణిగా చూసుకుంటా
నిను నా దానిగా చేసుకుంటా॥ ॥అందాల॥
ఉదయమే నీ మోము
చూసుకుంటా
హృదయ పళ్ళెములో
హారతి పట్టుకుంటా!
నీ సింగారాన్ని బంగారంలా
చూసుకుంటా
నీ అందాన్ని డెందములో
పదిలంగా దాచుకుంటా! ॥అందాల॥
రెండు మూడు వసంతాల
దాకా సంతానం వద్దులే!
ఆపైన నరేంద్రుడో....రవీంద్రుడో....
చక్కని చంద్రుడొక్కడు చాలులే....
ఓ రుద్రమ్మ, మల్లమ్మ, ఏ చక్కని
తల్లైనా చాలులే........ ॥అందాల॥
చల్లని గాలి - చల్లని యిల్లు
చక్కని ఆహారమందిద్దాం
రోగాలు రాకుండా
టీకాలు వేయిద్దాం
మంచి దుస్తులే యిద్దాం
మంచి చదువులు చదివిద్దాం
వాడు....అధికారి కావాలి
అందలమెక్కాలి
మన పరువు దక్కించాలి........ ॥అందాల॥

# పాలు

అమ్మ పిలిచింది
రాను అన్నాను
మళ్ళీ మళ్ళీ పిలిచింది
మరి ఏమిస్తావన్నాను
పాలిస్తానంది
పాలు తాగే ప్రాయము కాదన్నాను
ప్రతి వ్యక్తికీ నాలో పాలుంది
నీ పాలు పంచుకోమంది

నా పాలు ఎంతో తెలియదు
అమ్మను పరిశీలించాను

అమ్మ సామాన్యమైంది కాదు
సౌగంధిక పరిమళ భరితము
సద్గుణ, సర్వమంగళప్రదము
సంగీత, సాహిత్యాల నిధి
సభ్యతా, సంస్కృతుల పెన్నిధి

అడుగడుగునా మడుగు
అది మడుగు కాని మడుగు
విజ్ఞాన సముద్రపు టడుగు

కళ్ళు తిరిగిపోయాయి
ఒళ్ళు తెలిసొచ్చింది
సుళ్ళు లెక్కించలేనన్నాను
పాళ్ళు తెలుసుకోలేనన్నాను

స్వరూపం - విశ్వరూపం
ఆ రూపం అపురూపం
అదే విజ్ఞాన దీపం

గ్రంథాలలో దాచివుంచాను ధనం
దాన్ని గ్రహించడమే నీ గొప్పదనం
నీ పాలు పంచుకో - జ్ఞానాన్ని పెంచుకో
మనిషిగా బ్రతుకు - మహా మనీషిగా ఎదుగు

అంది మా అమ్మ.

# జీతంలేని జీవితం

ముందూ-వెనకాల
నీవు నడవాలి.
అతనికి రక్షవై నిలవాలి.
గుండెలో గుండు
దూసుకెళ్ళినా
బాకులు దూరినా
కాయాలి కాపలా
వేయాలి పహరా!

నీ దురాలోచనకు
తిలోదకా లిచ్చి,
అతని దురాలోచనకు
నీ జీవితము బలి చేయాలి.
ఎండల్లో కండలు కమిలినా
కుమిలిన గుండెతో మోయాలి - వ్యథల్ని
అయ్యగారి సేవలో
మురవాలి బాధల్ని.
గాలికి తట్టుకొని నిలుస్తావు.
వానకు చెట్టువై తడుస్తావు.
ఎండకు బండవై మసలుతావు.
కడుపునిండా ఆకలితో మాడుతావు.

వామిలో కాలినా,
చల్లని నీటికి నెలవై
నిండుకుండ వౌతావు.
అయినా నీ గొంతుకు
తప్పదు దాహం.
తప్పదు జీవితాంతం - దాసోహం.
చదువు నేర్చుకో
పెదవి విప్పుకో
మెదడుకు పట్టిన బూజు
విదుల్చుకో
మనిషివై మసలుకో!

బి. వసుంధర

# దీపలక్ష్మి

1. ప్రతి దివ్వె ఒక చాపంగా! వెలుగుల అలుగులుగా....
రావమ్మా, దీపలక్ష్మి రావమ్మా లోనికిరా....
అలా దేహళిలోనే ఆగిపోకు....
ముంగిలిలోనే సంశయించకు....
చిరునవ్వులతో, చిద్విలాసంగా నయనామృతాన్ని వర్షిస్తూన్నావు
ఎందుకో సంశయిస్తున్నావు ఒకించుక....లోనడుగిడుటకు
నీ రాకను రద్దు చేస్తానని భయమా?
నిన్ను పదవీ విరమణ చెయ్యమంటానని భయమా?
అనుమానించక మా గడపలో అడుగిడు ఐశ్వర్యలక్ష్మి!

2. ఆడబడచుల కన్నీళ్ళు తుడిచే దేశం మాది!
కన్నీళ్ళతో వారిని ఆకట్టుకునే ఆవేశం మాది.
ఈ "భూకంపాలు", "కరువు"లతో కార్చే....
కన్నీళ్ళకేం కొదువ తల్లీ మాకు?
ఆ నీటితోటే నీ కాళ్ళకు నీళ్ళిస్తాం దీపలక్ష్మి....
రావమ్మా మా లోగిట్లో అడుగిడు....

3. గుండె చెరువుల్లో పూసిన కలువలతో నిన్ను పూజిస్తాం
అంధకారాన్ని పారదోలి, మాకు నిండు వెలుగు
ఇచ్చే, దీపలక్ష్మి స్వాగతం....
నిన్ను మామధ్య నిలుపుకొని, మా బ్రతుకుల చీకటిని తుడిచేసుకుంటాం.
మందుగుండుతో - మహార్భాటంగా తరలి వస్తున్నావు!!
బాంబుల ధ్వనో, మందుల ధ్వనో తెలీక

సతమత మవుతున్నారు జనం
ఏడాది కొకసారి వచ్చే నిన్ను ఎగాదిగా చూస్తున్నారు
నేడు ఎంత తిన్నా నాయకుడికి రోజూ పరగడపు
అల్లుడు దశమగ్రహం అయితే, నాయకుడు ఏకాదశ గ్రహం!

4. పెంచొద్దంటూనే ధరలు పెంచేస్తున్నారు హిమాలయాల్లా
"తెలుగు కరువు" - కోరల్లో కొట్టుమిట్టాడుతున్నాం
ఈనాటి నరకాసురుల అత్యాచారాలకు అలజళ్ళకు
కిరాతకాలకు, ఆహుతి అవుతున్న ప్రమదలు
నరకాసురుడు మరణించాడని, ఎలా వెలిగించాలి ప్రమిదలు?
కరువు భత్యానికి సంబరపడిపోయి. కరువును గూర్చి
పట్టించుకోని ఉద్యోగులు - గతుకుల్లో పడిన
భూచక్రాల్లా తిరగడం మానేసి - ఉన్నచోటునే ఉంటున్నారు.

5. జీతాల అంకెలు పెరగటమే తప్ప జీవనసరళి మారలేదు సగటుమనిషికి
సంవత్సర కాలంలో Income Tax ల లెక్కలు చూస్తే
కాస్తో కూస్తో మిగులుంచుతున్నది ఖాళీ
మళ్ళీ మొదలు, సంవత్సరాది - ఖాళీ ఖాతాలతో
వచ్చిన డబ్బంతా పిల్లల చదువులకు వెచ్చించిన
నిరుద్యోగ దౌర్భాగ్యంతో నలిగిపోతున్నారు.

6. కాషాయాలు కట్టేనే, త్యాగధనులుగా చలామణీ అవుతున్నారు
సంపాదన సులభమని సాధువుల్లో చేర్తారు
అవగతం అయిందా తల్లీ! మా యీ పరిస్థితి
మా నేలలో అడుగుపెట్టి - అవినీతికి కొరివిపెట్టు
మా ముసుగుల లొసుగులను బయటపెట్టు
నాటి నరకుడే మేలేమో! నేటి వాడి వారసునికన్నా.

7. Fish Plates తొలగించి, Rail ప్రమాదాలు సృష్టించి
అమాయక ప్రజలు, వేల సంఖ్యలో మరణిస్తే
పైశాచికానందం అనుభవించే ఈనాటి నరకులకంటె,
ఆనాటి నరకుడే మేలేమో???

8. LITE లు, EXTREMISTS, MILLITANT లు,
NAXALITES
KIDNAP లు, P.W.G లు ఎందరో?
నిద్దరోతున్న వారిని తట్టిలేపి, వారింట్లో వారినే సజీవదహనం చేసి
వారి సంపదలను కొల్లగొట్టి బ్రతుకుతున్న
నరరూప రాక్షసులకన్నా, ఆనాటి నరకుడే మేలేమో?

9. ఇలా గడియ కొక ఉపద్రవం, క్షణానికో గండం
నిముషానికో ప్రణాళిక, గంటకో విపత్తు
రోజునకెన్నో వినలేని విషాద వార్తలు
అవగతం అయిందా తల్లీ మాయీ దుస్థితి
సంవత్సరాని కొక్కసారి వచ్చి మమ్ము పరామర్శిస్తావు
ఎన్నని విన్నవించను ఇలా?!

10. మనిషి మనిషిలో కాటేసిన నరకుడిని హతమార్చిననాడే
ఘన దీపావళి - శుభ దీపావళి -

11. "అతిథి దేవోభవ" అన్నారు ఆర్యులు ఆనాడు -
ఈనాడో? మనయింటి Calling Bell నొక్కి లోపలికి వచ్చి
ఆసీనులై, అతిథులుగా, పెద్ద మనుషుల్లా నటించి మననే
Shoot చేసేస్తున్నారు అతి తెలివిగా
ఇక ఏ ఆడబడచు అతిథులను ఆహ్వానిస్తుంది?
ముంగిట బయటే పంపేస్తుంది అతిథులను - తన సంస్కృతిని
సముద్రంలో కలిపేసి

12. "అహింస" అను పదంలోని, 'అ'ను కొట్టివేసి
"శాంతి" అనే పదం ముందు చేర్చారు
ఇక మనకు మిగిలింది హింస, అశాంతులేనమ్మా దీపలక్ష్మి!
రావమ్మా సందేహించకు అలా ముంగిటిలోనే ఆగకు

13. శాంతి భద్రతలు చెల్లాచెదరయినాయి
అవినీతి దివిటీలు వెలిగిపోతున్నాయి ఈ రోజు
ఏమిటిదని ప్రశ్నిస్తే, ఇక నూకలు లేనట్లే భూమ్మీద!!!
పదవీ వ్యామోహం పెచ్చుపెరిగిపోయినట్లే
మన రూపాయ విలువ రానురానూ తగ్గిపోతుంది నానాటికీ!

14. కులంవద్దు మతంవద్దు మారణహోమంవద్దు....అంటూనే
Application లో మొదటి ప్రశ్న (Column) ఏ కులం నీ దని!
అది తొలగిస్తే

అంతా ఒక్కటే! కులవైషమ్యాల కుమ్ములాటలు నిత్యం
కులంపేరిట కుచ్చితమ్ము మతంపేరిట మారణమ్ము

15. అంగరంగ వైభవం అనుభవిస్తూ, శ్రీరంగనీతులు వల్లిస్తుంటారు
చెప్పేవి శ్రీరంగనీతులు, దూరేవి నైట్‌క్లబ్ లట
వల్లిస్తారు మీటింగులలో వివేకుని సూక్తులు, గీతాబోధలు
ధన దీపావళి, ఘన దీపావళీ, ధన ధన దీపావళీ
విశ్వమానవతా మందిరాన మణిదీపాలను ప్రతిష్టించు!
ప్రతి దివ్వె ఒక చాపంగా, వెలుగుల తోరణంగా
సమైక్యతా దీపావళీ, లోనికి రావమ్మా, లోనికిరా....

16. మానవత కరదీపిక అయిననాడు
దురాచారాల వికటాట్టహాసాలు సమసిపోయిననాడు
మతోన్మాదుల దునిమిననాడు
అవినీతి విహంగపు రెక్కలు విరిచిననాడు
ప్రతిభకు ప్రథమ తాంబూలం ఇచ్చిననాడు
శాంతి పావురము రెక్కలు విప్పి విహరించిననాడు
యువత బాధ్యత లొదిలేసి, హక్కుల కోసం పోరాటం మానిననాడు
చదువులు మానేసి, రాజకీయాలకు దారి మళ్ళించక యువత
మసలిననాడు

మతం పేరిట మారణహోమాలు, సమసిననాడు
వెలిగిస్తాం మతాబులు, చిచ్చుబుడ్డులు, తారాజువ్వలు గగనవీధిని
అంటే దాకా!
ఆనందంతో పేల్చేస్తాం ఆటంబాంబులు! నీకిస్తాం ఆనంద హారతులు!

దీవి రంగాచార్యులు

## కాలం

ఎంతెంతో విలువైనది కాలం
ఇంతైనా పదలుట తెలివిహీనం
తరిగిపోయిన తిరిగిరాని ధనం
మరువరాని మరువలేని సత్యం!

తిరిగిరాదు జరిగినకాలం
తలచలేము పొందిన నష్టం
అందుకే మరువరాదు కాలగమనం
ముందు ముందు సాధించాలి విజయం!

ప్రతిజీవి సాగించు కాలంతో పోరాటం
పదిలమైనది కాదు మన జీవిత ఆరాటం
ఎన్నో అవరోధాలు కలుగుట సహజం
ఎదిరించి సాధించుటయే మన ధ్యేయం!

## స్వీయ స్వగతాలు

విద్యార్థి — ఇది స్పేస్ విజ్ఞాన యుగం
చదువులలో స్పీడ్ ముఖ్యం
ఎదగడమే జీవిత లక్ష్యం
ఎదిరించడమే మా ధ్యేయం!

*　　*　　*

ఉపాధ్యాయుడు — పునాదికి కడుదూరం
అనాదికి తిలోదకం
ఇది కదలే ఉడుకు రక్తం
కుర్రకారు మనస్తత్వం!

* * *

కరస్పాండెంటు — సీటు సీటుకి పొందాలి
చాలినంత డొనేషన్లు
చక్కని వ్యాపార మార్గం
చెప్పలేని కనకవర్షం!

ప్రభుత్వం — 'రీసెర్చి' మా ప్రగతిపథం
సెర్చికి ఇస్తాం ప్రాధాన్యం
నవ పథకాల కాలవాలం
నవ్యత కిదె సుస్వాగతం!
మా పేరు నిలవాలి శాశ్వతం -
మరి ఆశిస్తాం పిల్లల భవితవ్యం!
క్రొత్త సీసాలో పాత సారా
క్రొత్త పోకడ చూపిస్తాం!

# మేలుకొలుపు

భరతజాతి కిదియే మేలుకొలుపు
భావిపౌరుల కందాలి నా పిలుపు!
భారతీయుల సమైక్యతత్వం
పదుమైనదీ నిత్యవసంతం!

భాషలు ఎన్నైనా భావాలు ఒకటేనన్న
ప్రాంతాలు వేరైనా మానవత్వమే మిన్న
అందరి ఎదల సోదరభావం పెంచుటకన్న
లేదు ప్రగతి భారతీయులకింతకన్న!

ప్రాంతీయ దురభిమానం
పొంగిపొరలి సాగినచో
మానవత్వం మంటగలిసి
ప్రగతిరథం పొందు సున్న!

రక్తానికి రక్తతర్పణం
ప్రాణానికి ప్రాణహరణం
కోరుకొనే క్రూరత్వం
కారాదు మన ధ్యేయం!
ఆ మనిషిలో పెరిగే -
అలవిదప్పు దానవతను
అన్యాయపు రాకాశిని
ఆలోచింపక చంపాలి
అణగారిన కారుణ్యాన్ని
ఆశయాల సమతలతో
అనురాగపు మమతలతో
అనుబంధం పెంచాలి!
భరతజాతి కిదియే మేలుకొలుపు!
భావిపౌరుల కందాలి నా పిలుపు!!

## శంఖారావం

చుక్కలంటెడి ఈ ధరలతో
చిక్కుబడ్డవి బ్రతుకుబాటలు
బడుగు జనత హడలిపోయి
అలమటించెడి కాలంలో—

కూలి దొరకక - కుక్షి మాడగ
కడలి కెరటపు-సుడుల తీరున
భారమైన బ్రతుకులతో
అంగలార్చె రోజులలో—

బరువు లేనిదే ఫైళ్ళు నడవక
పనులకింత ఫలితమివ్వక
నిరుద్యోగికి మార్గం దొరకక
గతిని గానని దినములలో—

అర్థంకోసం సర్వంపీడి
అర్జనకోసం హద్దులు దాటి
స్వార్థపరుల పిశాచతత్వం
సవారిచేసే తరుణంలో—

కరుడుగట్టిన కులాభిమానం
హోరులెత్తిన మతవిద్వేషం
పదవీ పెదవుల ప్రలోభం
పడగలెత్తిన వేళలలో—

రాజకీయ ప్రాగల్భ్యంతో
ధ్వజమెత్తగ వర్గతత్వం
ధ్వంసమవ్వగ మానవత్వం
సమభావం సన్నగిల్లే సమయంలో—

జనతమేలు కోరి
సమత చాటిచెప్ప
కవితలే పరిఢవిల్లి!
కలకాలం విరియాలి!

అలముకొన్న ఈ నిశాక్లేశంలో
అవని జనత కాశాజ్యోతిగ
అవిచ్ఛన్నమై వెలుగొందగ
అంతులేని కవితలుద్భవించాలి!

పార్టీ తత్వం జోక్యంలేని
కులమత ద్వేషం దరికి జేరని
స్వార్థపరత్వం మనసున లేని
సమతాకవి సందోహం కావాలి!

విశ్వమందు సకలజనత
విశాల భావం చూపాలి
సమాజప్రగతి సాధించగ
సమైక్యతత్వం కల్పించాలి!

జాతిని మేలుకొలుపుచు
జగతికి శాంతిని పంచుచు
సాగాలి కవుల ఉజ్జ్వల కవిత్వాలు
మ్రోగించాలి శంఖారావాలు

# దివ్యహారతి

"యువభారతి" రజతోత్సవం!
సాహితీ ప్రచార విజయోత్సవం!!
రాజకీయ ప్రాగల్భ్యంతో
మోజుపడే మానవాళికి—
పదవీ పెదవుల వ్యామోహంతో
పరుగులు దీసే ప్రజావాహినికి
గత సాహితి గురుతులేక
ఘన సంస్కృతి కనజాలక
వెర్రి తలలు వేసే ఉగ్రవాదంతో
వెలలేని కరుణ మరిచే జనతకు
కమనీయ కవితాలతలతో
కొదువలేని కవుల అంతరంగాలు
మధురమైన ఉపన్యాసాలతో
మరువలేని లహరి ప్రచురణలతో
ప్రసిద్ధ సంస్కృతాంధ్ర కవుల భావాలు
ప్రతి ఎదలో ప్రత్యేకాభిరుచి కలిగిస్తూ
పదిలమైన విజ్ఞాన సంపదను పంచుతూ
సారస్వత వియద్గంగ నందిస్తూ
సాగుతున్న మన "యువభారతి"
స్పందింపజేసింది ప్రతి హృదయం
సాధించింది సాహితీ ఘన విజయం!
అందుకే....
రజతోత్సవాలు జరుపుకుంటున్న
రమ్యమైన ఈ "యువభారతి" సంస్థ
ముందు ముందు మరెన్నో ప్రచురణలతో
అందివ్వాలి సాహితీ దివ్యహారతి!
అందుగావుత నా అభినందనల—
మందారమాలల అక్షరాకృతి!!

సాలగ్రామ్

# పద్మవ్యూహంలో జీవనవాదం

యుగాంతపు ప్రళయంలో
పచ్చని వటపత్రంపై
విలాసంగా అవతరించిన కృష్ణుణ్ణి కాదు నేను!
కాలుతున్న అమ్మ కడుపులోనే
కష్టాల కథలు వింటూ
అరిష్టాల మంత్రసాని సేవలో
భూమిమీద పడి భయంతో 'కెవ్వు'మన్న నికృష్టుణ్ణి నేను!!
పసితనపు అమాయకత్వం నీడలో
ఈ లోకాన్ని ఆలోకించకుండా,
ఏవేవో పాటలు పాడుకుంటూ-
పనికిరాని పాఠాలెన్నో నేర్చుకుంటూ-
పిల్లకాలువగుండా యవ్వన తీరాన్ని
చేరుకొన్న వాణ్ణి - నన్ను -
ఆనంద సైకతాల్లో
హాయిగా పవ్వళించనీయలేదీ కాలప్రవాహం,
హఠాత్తుగా మలుపు తిరిగి
ఈ పద్మవ్యూహంలోకి తోసేసింది....! ...

*　　　*　　　*

ఈ పద్మవ్యూహం—
ఊహాలోకాల్లో తేల్చేది కాదు,
కనికరించి కలల్లో ముంచేదీ కాదు,

కఠినంగా కత్తి ఝుళిపించి
కదనానికి కాలు దువ్వుతుంది!
ఏమరితే చాలు
అదేపనిగా శస్త్రాస్త్రాలు రువ్వుతుంది!!
అభిమానం గలవాణ్ణి-
ఓటమి నెలా ఒప్పుకోను?
తలా, వొళ్ళూ విదలించి
యుద్ధానికి సన్నద్ధుణ్ణయ్యాను
అలనాటి అభిమన్యుణ్ణయ్యాను!
అనుక్షణం అతి జాగ్రతతో
ముందూ వెనుకలు కాచుకుంటూ
పోరాటం సాగిస్తున్నాను
ఈ పోరాటంలో అలుపు ఉండకూడదని తెలుసు
ఆప్యాయతతో సేదతీరాలన్న
ఆశ అసలు కలుగకూడదనీ తెలుసు
పద్మవ్యూహాన్ని ఛేదించాలన్నదే దీక్ష
ముందుకు సాగిపోవటమొక్కటే లక్ష్యం!! అయితే
వ్యూహంలోని దుష్టశక్తులతో పోరాట్టానికి
సహజ కవచ కుండలాలతో పుట్టిన
కర్ణుణ్ణి కాకపోవచ్చు నేను....
కాని, వొలిచి యివ్వలేని ఆత్మవిశ్వాసం
నాకు కవచంగా ఉంది!
మొక్కవోని 'నిజాయితీ' నా ఆయుధమైంది!!
అయితే, నా నిజాయితీ
ఈ కుటిల వ్యూహంలో అతి తేలిగ్గా ఓడిపోతోంది....
అందుకే నాకు గాయాలు తప్పటంలేదు!
ఈ గాయాలకు తప్పనిసరిగా
నేను పూసుకుంటున్న మందు
జీవన వాదం (existentialism)

* * *

ఇంతకూ నేను—
పద్మవ్యూహాన్ని ఛేదించగలనో లేదో
నాకు తెలియదు.
ఒక్కటి మాత్రం తెలుసు
అంతకంటే గత్యంతరం లేక, ఆ ప్రయత్నంలోనే
వీరస్వర్గ మలంకరిస్తాను!

## పుస్తకం!

నిన్ను పట్టుకున్ననాడే
నేను 'మనీషి' నయ్యాను
నన్ను ఆకట్టుకున్న నీవే
నా జీవన సహచరి వయ్యావు
నీలోని అక్షరాలే
నాకీనాడు లక్షాధిక లక్షలు
నీలోనే 'పదా'ర్థాలే
అహరహం నాకు రక్షలు!
నీవు - ఏకాంతపు చీకటి జీమూతం
నా జీవనాకాశాన్ని అలుముకున్నపుడు
ఆతురతతో పరుగెత్తుకువచ్చి
వాటిని పారద్రోలి నన్నాశ్వాసించిన పవనానివి!
గుండె బేలయై, బ్రతుకుభయం
నన్ను బంధించినపుడు
నా వేదనను నీకు నివేదించుకుంటే చాలు
నన్ను బుజ్జగించి,
నాలో ఆత్మవిశ్వాసాన్ని నింపి
నన్ను పునరుజ్జీవింపజేసే కవనానివి!
అర్థంకాని సమస్యలతో
నేను సతమతమైనపుడు
మార్గం తెలియక—

నేను వ్యాకులపడ్డపుడు
వేదంలాంటి మాటలతో
సమస్యార్థాల్ని సముద్బోధించి
పరిష్కారం తెలిపే మార్గదర్శివి!
నా మోదంలో, నా ఖేదంలో
నా బ్రతుకు బాధల నిర్వేదంలో
'నేనున్నా'నంటూ నిండుగ పలికే - నీవు
నాకు ఆత్మీయమైన నెచ్చెలివి!
నాలో భక్తినీ, రక్తినీ కలిగించి
ఎన్నో రాగానురాగాల్ని వెలిగించి
గిలిగింతల పులకింతలు ప్రసాదించే - నీవు
నా మనుగడకే వరప్రసాదానివి,
నేను ఎన్నడూ కోల్పోని నా గుప్తధనానివి!
జీవన పోరాటం అర్థరహితమనీ
వైరాగ్యంతో స్తబ్ధుణ్ణయ్యే నాకు
ఎప్పటికప్పుడు నీ విశ్వరూపాన్ని ప్రదర్శిస్తూ,
జీవపదార్థాన్ని వివరిస్తూ -
గీతోపదేశం చేసే దైవానివి!
ఆపత్తు విపత్తుల్లో
నాకు సహాయహస్తానివై -
నవలవై, కథవై, కమనీయ కవితవై -
నన్నూ నా వ్యక్తిత్వాన్నీ మలుస్తున్న నేస్తం -
నా జీవితాన్ని లాలిస్తూ పాలిస్తూ -
నేనంటే ఎవరను ప్రశ్నకు సమాధాన మిచ్చిన
ఓ పుస్తకం!
నీవు నేర్పిన భావాలతో నిండుకొని
నీమీది ఆరాధనతో - నతమవుతోం దిదే
నా మస్తకం!

# ఫిజిసిస్ట్ ప్రేమగీతం!

యవ్వనపు విద్యుత్తు ప్రవహించే నీ మేను
మెర్క్యురీ ఆర్క్ దీపంలా వెలిగిపోతోంది!
ఊహాకటకం ఆధారంగా
నా హృదయ వర్ణపటదర్శిని గుండా,
ఆశానయనాలతో
నీ కాంతిని అవలోకిస్తున్నాను
చెలీ, వర్ణనాతీతంగా ఉంది
నీ రాగరాగాల వర్ణపటం!
ఆశాశృంగాలతో, నిరాశాద్రోణులతో
కల్లోలితమైన నా మనస్సాగరంలో
కాంక్షాతరంగాలు ఉవ్వెత్తున లేచాయి
కులమతాల అడ్డుగోడల్ని ఛేదించుకుంటూ
కాస్మిక్ కిరణాల్లా నీవైపు
దూసుకు వస్తున్నాయి నాలోని కోరికలు!
ప్రకోపించిన ఆటమ్‌లా ఉన్నాను!
తట్టుకోలేని తమకంతో
మీటర్ చేతులను నీకోసం
కిలోమీటర్ల దూరం వరకు చూస్తున్నాను
పాదరసంలా మిడిసిపడుతున్న డార్లింగ్,
నీవు ఆకాశంలో తారకవైనా
నా హృదయపు టెలిస్కోపు నిన్ను వీక్షించగలదు
నీవు ఎక్కడ గానం చేసినా
రేడియో తరంగాలుగా సాగి
అది నా గుండె రేడియోలో ప్రతిధ్వనిస్తుంది!

నిన్నీ పాడు లోకం చిలుకను చేసి
ఏ సప్త సముద్రాల అవతలనో
కాకులు దూరని కారడవిలో
చీమలు దూరని చిట్టడవిలో దాచినా
నీ గుండెలో ఇరుక్కుపోయిన నా గుండె ట్రాన్స్మిటర్‌తో
- నీ మీది లవ్ పవర్‌తో
నా మనో టెలివిజన్‌లో దర్శించగలను!
మైక్రోవేవ్ ప్రణయ సందేశాలు పంపించగలను!
ప్రియా, నీ వొక విద్యుదయస్కాంతానివి,
నిన్ను విడవకుండా అంటిపెట్టుకొనే
నేను ఒక ఇనుపముక్కను!
అందుకే నా జడత్వాన్ని విదలించుకొని
సూపర్‌సానిక్ వేగంతో ఎగిరివస్తున్నాను
నిన్ను హత్తుకోవటానికి!
మనలో లవ్ విద్యుత్ప్రవాహమున్నంతకాలం
ప్రియా,
మన కౌగిలి నెవ్వరూ విడదీయలేరు!

## ములకల బాలాజీప్రసాద్

# చేనేతచైతన్యం

పత్తి దారాలుగా మార్చి, పత్తి మా గుండెల కదుముకుంటూ
బ్రతుకు ఎడారిన పండించుకుందామంటే
నరరూప రాక్షస రాజకీయాల కుష్ఠు హస్తాల్లో
చిక్కిన మా బ్రతుకులు రాబందు నోట్లో శవపు పీలికలచీలికలు
ఎన్ని కడవళ్ళ కన్నీళ్ళతో వేడుకున్నాము
మా భవిష్యత్తరాల బ్రతుకుల్ని కాపాడమని
ఎంతమంది నిశాచర అరుల్ని బ్రతిమాలుకున్నాము
మా బ్రతుకుల్నించి కారే నూలి వాసనల్లోంచి
బాధాతప్త దాహాశ్రువుల్ని ఒలికించమని
ఆ నూలిదారాలే ఉరితాళ్ళుగా మారి
నిర్దాక్షిణ్యంగా మా కుత్తులను కత్తిరించేస్తున్నాయ్
మొన్నొక పెడన నిన్నొక అంబాజీపేట
నేడొక గుంటూరు రేపొక ఆదివారపు పేట
వడుకుతున్న కండ్ల (కండి) చివర్ల నుంచి
కారుతున్న రక్తపు టశ్రువులను త్రాగి
బ్రతుకుదామనుకున్నా! వూసలు బాకులుగా మారి
మా గుండెల్ని ఛిద్రం చేస్తున్నాయ్
ఆసుల్లోంచి వచ్చే పడుగుల్లా
ఎండిన దేహాల్లోంచి రక్త మాంసాలను కరిగించి
జనతా వస్త్రాలుగా చేసి జనులను అలరించగలిగాం
ఎన్ని కుంచెల్ని గరకు గుండెల మీంచి లాగుతూ వెళ్ళామో
బండబారిన ఆ రాజకీయ గుండె మా ఘోషల్ని వినదు
అరిగిపోయిన అస్థిలాల్నే పలుకుతుంటాయవి.

నిరాధార నిర్వేద జనులను విస్మరించే సంఘాలు
బలిసిన విషస్వార్థపు మర మనుషులకే స్వంతాలు
భూతద్దాల్లోంచి కనిపించే బ్రతుకు పోగుల్ని లెక్కపెడుతూ
సాగల్ని జమకడుతూ మజూరీల్లోంచి తెగ్గొడుతూ
ఎన్ని విషపు వలయాల్నుంచో మా రక్తపు బొట్లను
కారకుండా అదిమి పెడతున్నాం
సాలెపురుగుల్లా సంఘా లొదిలేసిన మలినంలోకి
జారకుండా బ్రతికేస్తున్నాం.

సుకుమార కుసుమాల చిగురులను నేతపై
నేసి ధరీకృతులను మెప్పించగలం
అగ్గిపెట్టెలో పెట్టే అందాల అతివ వస్త్రాలను సృష్టించగలం
కాని
జానెడు కడుపుకోసం గుప్పెడు మెతుకుల్ని
మాత్రం నోచుకోజాలం
సిగ్గును కప్పుకోడాన్కి జానెడు బట్టను
కూడా మిగుల్చుకోజాలం

రెండు చేతులతో సిగ్గును కప్పుకుంటూ
పెగిలిన గొంతులోని రక్తపు జీరలు నిర్గమించేలా
గొంతూ గొంతూ కలిపి
అగాధాల అంచులు వణికేలా అరుద్దాం

మన పిలుపు రాజకీయ పెనుభూతాల్ని అదిలించాలి
సాటి సామాన్యుడి బద్ధకపు ముసుగును తొలగించాలి
మగ్గపు పిడి పట్టే చేతులతో
తెగేసిన తెలి ఆవేశాన్ని పట్టుకొని
నిర్లజ్జా రాజకీయాల్ని అంతం చేసే
మరో చేనేత చైతన్యానికి ఆహ్వానం పలుకుదాం.

(ఆకలిచే హత్య చేయబడ్డ చేనేత కార్మికుల కంకితం.)

కొర్ర్రపోలు మాధవరావు

# కళ్ళుమూస్తే వెన్నెల?!

ప్రపంచంలో ఏ మూల చూసినా -
ప్రచండ యుద్ధ జ్వాలల చీకట్లు!
అమృత భాండాలైన మేఘాలనుండి -
మహా భీకర జలప్రళయాల చీకట్లు!
కార్ల, కార్ఖానాల నీలి నీలి పొగల -
అతి భయంకర కాలుష్యపు చీకట్లు-!
'కుల'కక్షల, 'మత' దురభిమానాల -
రాకాసి ముసుగు ధరించిన రాజకీయపు చీకట్లు!
వివాహ వ్యవస్థను కాటేస్తున్న
వరకట్న కాలసర్ప విషపు చీకట్లు!
సమ సమాజాన్ని - నవతరాన్ని
సందిగ్ధ స్థితిలోకి తోస్తున్న నిరుద్యోగపు చీకట్లు!
లోకమే చీకటిగా, చీకటే లోకంగా మారిన వేళ -
అంతటా స్వార్థం నిండిన పెను చీకట్లలో....
వెన్నెలెప్పుడు....?! వెన్నెలెప్పుడు?!

# శ్రమామృతం!

వసంత కోయిల వలపు పిలుపులవిగో....!
కాల విపంచీ మధుర గానమ్ములవిగో....!
మానస కాసార కల్హార పరిమళమ్ములవిగో....!
నవ చైతన్య చంద్రికా సూనమ్ములవిగో....!

అవి గవిగో....
భావాంబర వీధుల చెలరేగిన
శబ్దతారకా తటిల్లత లవిగో....!
శాంతి సాగర సీమలో స్వాతిచినుకు లవిగో....!
ప్రగతి శిల్పమ్మును చక్కగ చెక్కగ—
ఆత్మ శక్తి ఉలి అదిగో....!
అక్షరమే 'అమృత' కాంతి ధారగా
హృదయ చషకాన నిండిన దిదిగో....!
చేదు ఏల - ఈ తీపి నందుకో....,
శ్రమాశ్రమముల నుండి
అనుభూతి క్షీరమును ఉభయ సంధ్యల పిండుకో!!

# అవ్యక్తపాశం

నేడు పల్లవించిన ఆకుతో
రేపు మొగ్గకుండే బంధం!
జగాలు తిలకించు కంటిపాపతో
రెప్పకుండే అనుబంధం!
ఓ మొయిలు తీవనుండి రాలే
తొలి చినుకు పూవునకు గల బంధం!
గగన సీమలో మెరిసే తార - తారల -
మధ్య నుండి తొంగిచూసే లోచనాబంధం!
ఈ బంధాలన్నింటినీ మించిన బంధం -
తరతరాలకు అంతరా లెరుగక,
అరమరిక లెరుగక -
మమతల కోవెలలో మాయని నిత్య సు'బంధం'
ఈ అవనిలో మనిషి - మనిషికి ఉండే బంధం!

# మృత్యుశకలం !

కలల్లోంచి ఉక్కు రెక్కలతో
ఆకస్మాత్తుగా దూసుకుపోయిన
అమానుష, అక్రమ, అన్యాయ, అవినీతి
క్షిపణుల సాక్షిగా....!
తెగిన గాలిపటంలా,
రాలిపడే మృత్యు శకలంలా,
కాల కురంగపు కంటి కొసల్లోంచి
జారిన కన్నీటి బొట్టులా,
హృదయ నిశ్శబ్ద సాగరంలో
చెలరేగిన పెనుతుఫాను జ్వాలలా,
నిర్విరామ గగన చుంబనాల్లో
కన్పించకుండా పోయిన నేలపై
ఆత్మత్యాగం చేసుకొనేందుకు సిద్ధమైన
'ప్రజాస్వామ్యం' !!
జనవాహిని చైతన్యపుటలు పరిస్తే
తన చిరునామా పునర్ముద్రించుకోవాలని....!

డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం

# మినీ కవితలు

## మొలక

కొత్త గులాబీ
నవ్వింది
అన్నది మా కవిత
దానికింద
ముల్లుండాలి చూడు
అన్నాను నేను
చూచింది—
కవిపేరు చెక్కిన
శిథిల సమాధి.

## అపూర్వవరం

అంగారానికి
అమ్ముకొనే
అంగట్లో
వెలలేదు
ఆక్రోశించే
హృదయంలో
తుల లేదు
ఆగ్రహించే
కన్నుల్లో
జ్వాల లేదు.

## పునర్నవం

కాల ప్రవాహం
కవిత
ప్రతి ఉదయం
సూర్యుడు పెట్టే
గిలిగింత
నవత.

## పేలకు

నీవు
తుపాకి
పేల్చబోతున్నావు
జాగ్రత్త!
ఎటు గురిపెట్టినా
ఏదో ఒక గుండె
నిలువునా
మండుతుంది.

## తరం కాని వరం

నవ్వటం
ఒక వరమని
విన్నాను
దానికొక
తరం కావాలని
తెలుసుకొన్నాను.

## మది

నదిలో మునిగితే
స్నానం
నీలో మునిగితే
ధ్యానం.

## అయోనిజ

నిన్న
నే నని తెలుసు
రేపు
నా కూతు రనీ తెలుసు
అయినా
నేడు
ఇంకా కాపరానికి రాలేదు.

## ఎద్దడి

వరద గూడు కూడా
కూలిపోయింది
కన్నీటికి కూడా
కరువు వచ్చింది.

## వాస్తవికత

ఊహలతో
బాసలు చేసే నేను
ఊయల లూగిస్తూంటే
ఊఁ కొడుతూ
నేలను చూచే నీకు—
మట్టే బంగారమా?

## గుర్తు

లోకాన్ని
'నేను' గా చెప్పుకుంటే
సింబల్.
నేనే
లోకంగా మారిపోతే
ఏంజెల్.

## సడి - సవ్వడి

వాడు
నిశ్శబ్దంగా ఉన్నా
నీరధిలో
బడబాగ్ని.
వీడు
మాట్లాడుతున్నా
అలల నడిమి
గండశిల.

## అప్పుకూడు

ఏం? తుపాకీ!
ఆగి ఆగి
అప్పుడప్పుడు పేలుతున్నావ్?
అమ్యూనిషన్ అయిపోవచ్చింది.
ఆ తరువాత ఏంటి గతి?
కొత్తమందు దిగుమతి అవుతుంది.
దిగుమతి కూడా ఆలస్యమైపోతే?
పేలకపోయినా తుపాకి తుపాకే.
దిగుమతికి ముందు
ఎగుమతు లేవైనా చేశావా?
ఎగుమతికి కావాలి ఎగ్జిస్టెన్సు
దిగుమతికి చాలు ఎక్స్పీరియన్సు.

వి. నాగరత్నకుమారి

# ఆశాభంగం

నిన్ను చూసినప్పుడు
ప్రకృతిని దర్శించినప్పుడు
మధుర గానం విన్నప్పుడు
నాకు కలిగే సంతోషాన్ని
సమస్త భాషలందలి
సర్వ విశేషణాలతోనూ
వర్ణించి, వ్యక్తపరచ వీలవ్వదు
ఈ మూడింట్లో ప్రతిదీ
నా చేత ఆనందబాష్పాల్ని కురిపిస్తుంది
అవధి లేని ఆనందంతో
హృదయం లయ తప్పుతుంది
ఆలోచనా పథంలో వుండే నీవు
మరీ అందంగా అగుపిస్తావు
నేను పరమానందంతో
రెప్ప వాల్చక తిలకిస్తుంటాను
వెంటనే ఆశాభంగమౌతుంది
నా అలికిడికి భంగిమ మార్చేస్తావు
నన్ను చూసి నవ్వుతావు
కానీ నాకు నిజమయిన నవ్వురాదు.

# దర్శన భాగ్యం

నీపై నాకున్న ప్రేమ అనంతం
దానికి మొదలే తప్ప తుది లేదు
అనుక్షణం నువ్వే గుర్తొస్తావు
అణువణువూ నిన్నే జపిస్తుంది

ఇది తప్పని తోచదు నాకు
నాది అవ్యాజ నిస్వార్థ ప్రేమ
నీ నుండేమీ ఆశించి ప్రేమించలేదు
నే సదా కోరేది నీ దర్శన, హాసాలాపాలు
ఇంతకు మించి ఇంకేమీ వద్దు
నిన్ను చూడని నాడు శాంతి వుండదు
నీ పలుకులు కరువైనప్పుడు
నాపై నాకు విరక్తి కలుగుతుంది
నీవు నవ్వని రోజు
సర్వం స్తంభించినట్లుంటుంది.

## నీకే తెలియాలి

నీ పాటలు పాడుకుంటున్న
ఏకాంత సమయంలో
నువ్వు ప్రత్యక్షమయ్యావు
నిను చూసిన మరుక్షణం
నా గొంతు జీరవోయింది
మాట పెగలక పాట ఆగిపోయింది
నీ దర్శనం కోసం తపించే నేను
సిగ్గుతో తల దించేశాను
వెళ్ళిపోతావనే దిగులతో
ఒక్కసారి అలవోకగా చూసి
దృష్టి నిలపలేక కళ్ళు వాల్చేశాను
అనుక్షణం నీ కోసం నిరీక్షించే నేను
నీ ముందెందుకో మౌనినౌతాను
అనంత తేజో విరాజితుడవైన నీవు
నా పిడికెడు గుండె గ్రహించలేవా?

## ఘనుడు

నా అంధకారపు జీవితంలో
మెరపు తీగవై వెలిశావు
ఊసులాడి, ఆశలు రేపి
ఆనందానికి అర్థం తెలిపి
అందకుండా పోతావా
నిను పొందాలని తపిస్తుంటే
వినోదం తిలకిస్తావా
తిరిగి తిమిరంలో వదిలేస్తావా?
చీకటిని చీకటిగా ఉండనీక
నీ క్షణికమైన వెలుగురేకతో
నా ఉనికిని చూపి, ఉన్నతి తెలిపి
తుదకు గేలిచేసి కలవరపరుస్తావా?
పసిపాపని పైకెత్తి అల్లాబిల్లీ తిప్పి
ఎత్తి కొట్టేంత గొప్పవాడివా నీవు?

## బధిరుడు

నువ్వెంత నిర్దయగా ఎందుకుంటావు?
నన్నింత నిర్లక్ష్యం ఎలా చేయగలుగుతావు?
గాంభీర్యం, చాంచల్యం, రాక్షసత్వం, కర్కశత్వం
ఇవే నీ నైజాలు తప్ప
చిలిపితనం, నిశ్చలత్వం, సాధుత్వం, సౌకుమార్యం
అనేవి బీజమాత్రంగానైనా లేవా?
నీ హృదయం రక్త మాంసాలతో కాదు
నిశ్చయంగా శిలా జలాలతో తయారయింది
అందుకే నీలో స్పందన లేదు
దేనికీ కదలవు, చలించవు
నీకో మనసు లేదు, నువ్వో మనిషివి కావు
రాగం వింటే మృగమయినా
శృంగం ఊపుతూ సొగసు గ్రహిస్తుంది
కానీ
నువ్వు అనురాగాన్నే అనుమానించే
ఉన్నత స్థానంలో వున్నావు.

# అపశ్రుతి

నన్ను పిల్లగా చూసిన పెద్దలు
గుర్తుంచుకుని పలకరిస్తుంటారు
చిన్నప్పటి అల్లరి చేష్టలు
చెప్పి నవ్విస్తుంటారు

రెండుసార్లు తన దగ్గరే కొన్నానని
కూరలమ్మి కబుర్లాడుతూ
కావలసినవేమిటో కని పెడుతుంది

పరిచయమే లేని పసివాడు
ఏ పూర్వజన్మ స్మృతులనో
జ్ఞాపకం చేసుకుంటూ
కేరింతలు కొట్టి నవ్వుతాడు
నన్నెత్తుకోమని దూకుతాడు

ఆఖరికి ఒక్కసారి చూసిన
స్నేహితురాలి పెంపుడు కుక్క
సంతోషంతో తోకూపుతూ
నాకి నాకి ప్రేమ చూపింది

ఆప్తమిత్రులు, ఆపద్బంధువులే గాక
పరిచయమున్న ప్రతి ఒక్కరూ
మరచిపోక మాట్లాడిస్తుంటారు

పిచ్చిగా ఆరాధించినందుకు
నీకు మాత్రం నే గుర్తురాను
నా జీవన గీతంలో
నీ ప్రేమాలాపన
ఘోర అపశ్రుతి.

కొపెర్ల మద్దయ్య

## నీకేమున్నది?!

ఏ మున్నది?
నీ కేమున్నది??
కండా?
అండా?
జెండా??-
ఏ మున్నది?
నీ కేమున్నది??
ఊరా?
పేరా?
నోరా??-
ఏ మున్నది?
నీ కేమున్నది??
ఓర్పా?
నేర్పా?
తీర్పా??-
ఏ మున్నవి?
నీ కేమున్నవి??
నోట్లా?
సీట్లా?
ఓట్లా??-
చెప్పవోయి! - నీ చోటు!
అడుగవోయి! - నా ఓటు!!

## ఎవరయ్యా! ముందుకు వచ్చేవారు?

ఆగండర్రా! ఆగండి!
అడుక్కోవటం మానండి!!
అది - శిధిలాధారం!
అంటే - అదే "మధురం!
లేకుంటే మేమందరం!
కాటికి పయన"మన్నారు!! -

నెట్టండ్రా! నెట్టండి!
నేలబడిన క్రూరుని పట్టండి!!
అది - మానవాభ్యుదయం!
అంటే! - " అమ్మయ్యో! భయం!
అడుగిడుతే చావు ఖాయం
అందుకయోగ్యులమ"న్నారు" -
చేయండ్రా! చేయండి!
చెమట బిందువుల నెమరు వేయండి!!
అది - విధి విలాసం!
అంటే "కాదు మోసం!
మేమితరుల కోసం
బానిసలమా?" - అన్నారు!! -
ఎవరయ్యా! ఎదముందుకు కదుపుతూ -
ఏడుపులు - గాడుపులు ఎదురైననూ -
బిడియక బిగువుగ చెయ్యి కలుపుతూ -
సమైక్యత స్థాపనకు సాగివచ్చేవారు?!

## ఇదే-(నా) లోకం?!

భుక్తి మరణాలు!
రక్త చరణాలు!
శోక అరుణాలు!
పాప కిరణాలు!!-
ఇది - నరకలోకమా?
నాక లోకమా?
కాలే కడుపులు!
వాలే నడుములు!
రాలే తోయములు!!
తూలే కాయములు!!-
ఇది - సరకలోకమా?
నాక లోకమా?

సహస్ర మోసాలు!
స్రవించె విషాలు!
ద్రవించె కృత్యాలు!
భ్రమించె హత్యలు!!-

ఇది - నరక లోకమా?

నాక లోకము?

కృశించె మానవత్వం!
స్పృహించె దానవత్వం!
నశించె కరుణత్వం!
లిఖించె కఠినత్వం!!-

ఇదేనా - లోకం ??

ఇదే - నాలోకం!!

## సంఘీభావం పెరగాలి !!

ఒక్కసారిగా—

ఒక్క మాటతో -
ఒక్క పూటలో -
సమస్య తీరిపోతుందా?

సమాజం మారిపోతుందా??
ఒక్కసారిగా—

నిండిన స్వార్థం!
పండిన పాపం!!
తొలిగిపోతుందా?
పగిలిపోతుందా??

ఒక్కసారిగా—

మాతృదేశభక్తి!
నవచైతన్య శక్తి!!
పెరుగుతుందా?
జరుగుతుందా??

దుష్టబుద్ధులు మారాలి!
మంచి పద్ధతులు రావాలి!
హృదయ పరివర్తన జరగాలి!
సంఘీభావం పెరగాలి!!

# ఇదేనా ప్రగతి ?!

వినుపింతునా - మన ప్రగతి
వివరింతునా - మన సంగతి!!

కరువు కాటకాలు!
ఆకలి సంకటాలు!!
ఆత్మహత్యలు!
నిత్యసత్యాలు!!

అబద్ధ వాగ్దానాలు!
అక్రమ కార్యాలు!
అన్యాయ చట్టాలు!
పేదలు నేలమట్టాలు!!-

గోడలమీద నినాదాలు!
గోడలలోన రోదనాలు!!
మేడలమీద వినోదాలు!
మేడలలోన విరోధాలు!!-

ప్రజా సంక్షేమ నిధులు!
అధికారుల వాటాలు!!
పాలకుల పచ్చి మోసాలు!
నిరుపేదల ఆకలిచావులు!!-

నీతిలేని కామాంధులకు-
మత్తెక్కిన రాబందులకు-
బీదల గోడులు వినపడవు!
పేదల గోడలు కనపడవు!!-

ఇదేనా - మన ప్రగతి!?
ఇదేనా - మన సంగతి!?

పి. సంగారెడ్డి

# రోజూ తప్పక దండం పెడతా

రోజూ తప్పక దండం పెడతా
మనిషి మనుగడకు స్పందన నిచ్చే
దేశ ప్రగతికి పెద్ద దిక్కు నిచ్చే
ప్రకృతికి నే దండం పెడతా!

సౌందర్య హేల తాము దూకిన నేల
విద్యుచ్ఛక్తిమాల తాము దూకిన నేల
నీటి తుంపర షతాబు తాము దూకిన ధరణి
పచ్చగడ్డి జముకాణం తాము పాకిన ధరణి
ధాన్యం పొట్లాల గోదాం తాము పారిన పొలం
తాము నిలిచిన తావు మంచినీటి కుప్ప
తాము నిలిచిన తావు బతుకు చెరువు
తాము విడిచిన తావు బతుకు ఎడారి
తాము విడిచిన ఒండు పంట పొలాల కెరువు
తాము తెచ్చిన ఇసుక నిర్మాణ ప్రాజెక్టుల కెముక
జలజలా పారితే చిరుగజ్జెల మోత
బిరాబిరా పారితే గుడిగంటల మోత
అఖండంగా పారితే నాదస్వరాల మోత
పాయలుగా పారితే కాలి అందెల మోత
జలపాటవంలో చైతన్యమిదియంటు
జనపాటవంలో చైతన్యముందంటు
జలశక్తి జనశక్తి కలిసి పయనిస్తే

మిత్రశక్తి సవశక్తిగా పరిణమిస్తే
జగతిజీవనం సుఖమయమంటూ
పరులకొరకే ప్రపంచమంతా
పయస్సుల పాయల్లో
ప్రాణకోటికి జీవనమిస్తూ
తల్లిదండ్రుల స్మరింపజేస్తూ
ప్రగతియే మార్గంగా
పరుగుల నడకల పయనంసాగే
నదీనదాలకు నే దండం పెడతా!

* * *

ఎండకు ఎండి కొమ్మలనీడనిచ్చి
నిండుగ పూచిన అందాల పూలనిచ్చి
పుష్టిగ కాసిన మధుర ఫలాలనిచ్చి
చెడుగాలి పీల్చి చల్ల(ప్రాణ)గాలినిచ్చి
త్యాగమంటే? శక్తికొద్ది సాయపడుటే
నిదర్శనంగా నిత్యం నిలబడి బ్రతికే
ఫల వృక్షాలకు నే దండం పెడతా!

* * *

తాము నిత్యం బురదలో నున్నా
పచ్చగ నవ్వూతూ పలకరిస్తూ
వరికంకులతో ఆతిథ్యమిచ్చి
రైతుల పాలిటి కడగండ్లను తీర్చే
వరి(పంట)పొలాలకు నే దండం పెడతా!

* * *

తమ నడకలో క్రమశిక్షణుందని
క్రమశిక్షణలో ఐక్యముందని
ఐక్యతలో ప్రగతి బలముందని
శిక్షణదారిలో నిత్యం నడిచే
చీమలకు నే దండం పెడతా!

* * *

పరిభ్రమిస్తూ పరిశ్రమిస్తూ
పువ్వు పువ్వునా సారం గ్రోలీ
పొదుపుగ తాము సమకూర్చే
తేనె నిధుల రుచులు జూపి
పొదుపుగల జీవితం మధురమని
పొదుపులేని జీవితం దుర్భరమని
పొదుపు మార్గం తెలియజేసే
తేనెటీగలకు నే దండం పెడతా!

* * *

నిత్యం తాను విరామ మెరుగక
రాత్రంతా చీకటితో పోరాడి
పగలంతా వెలుతురు వెదజల్లుతూ
కష్టసుఖాలు చీకటివెలుగులంటూ
ప్రాణకోటిని తట్టి లేపుతూ
గురు మిత్రుడై ప్రోత్సహించే
క్రాంతి సూర్యునికి నే దండం పెడతా!

* * *

ప్రకృతిని వికృతి జేసి పబ్బంగడిపే
కలుషాత్ములకు నే దండమును జూపుతా!
ప్రకృతి పవిత్రతను పరిపోషించే
పరిణాత్ములకు నే దండం పెడతా!
మనిషి మనుగడకు స్పందన నిచ్చే
దేశప్రగతికి పెద్ద దిక్కునిచ్చే
ప్రకృతికి నే దండం పెడతా
రోజూ తప్పక దండం పెడతా!

# లక్ష్యం – సాధన

రాత్రనకా పగలనకా
ప్రతి నిత్యం దీక్షగా
సముద్రం సాధన చూస్తుంటే!
కడుపులో ఉన్న జలచరాలవలె
పరోక్షంగానైనా సరే
వెలుపల ఉన్న ప్రాణులకు జీవనమిచ్చే
గొప్ప లక్ష్యం ఉదధికున్నట్టుంది.
అదేదీ లేకుంటే? నిత్యం
అలల రెక్కల్తో ఆకాశాని కెగుర్తూ
తన ఆవిరి చేతుల చాచి
మేఘమై మెరిసిపోయేదెందుకు?
మనిషికి
లక్ష్యం ఏమిటి?
మంచివైపు నడవడమే కదా!
మంచి ఉద్దేశం ఉంటే
జీవితం సుఖ సాగరమే కదా!
అదేదీ లేకుంటే
జీవితం దుఃఖ పారావారం కదా!
అందుకే
నాలో కల్గిం దొక ఆలోచన
ముందుకు సాగిపోయే సద్ యోచన
నీవూ నేనూ కలిసిన మనందరం
ఆగని నిత్య లక్ష్య సాధకుల దీక్షా బంధురం.

జి. సరోజ దేవసాయం

# సందేశం

మానవలోకానికి లొంగి మారిపోకు గగనం చుక్క
మానసికంగా కృంగిపోకు సుగుణం అక్క
మదిలో నెమ్మదిగా ఆలోచించిన లేకుంటే పొరపాటు
మాదిరి ఆత్మహత్య నీకెందుకు లేనప్పుడు ఏ లోటు
నీవాళ్ళు కానివారి గురించి అందుకోకు మృతి టికెట్టు
నీ కళ్ళు మూసుకోకు మూగబోకు నీ నీతిపై ఒట్టు
హద్దుమీరి అభిమానించకూడదు నా చెల్లి,
అద్దంలా పగిలిపోతే అతకవు మళ్ళీ మళ్ళీ
తీగలా మారి ఆసరా కోసం ఆశించకు అమ్మాయ్
త్యాగశీలిగా పందిరి కొస ఆహ్వానించదు చెల్లాయ్
అమాయకత్వం నీలో చేరినా
త్యాగమూర్తిలా నీవు మారినా
ఈనాడు ఆ రెండూ పాటిస్తే వచ్చేది అపనిందని మరిచిపోకు
ఈ లోకంలో అందుకే ఎవరితో పోట్లాడకు అలాగని మాట్లాడకు
నిరాశా నిస్పృహలు పాటించకు
నీవు ఎవరినుండీ ఏదీ ఆశించకు
నీ భావాలను ఇతరుల ముందుంచకు
నిరసనగా ఆవేశంతో సంభాషించకు
సహాయాన్ని అర్థించకు ఎదిరించకు
స్వయంకృషిని మతి మరిపించకు
నీలో తారాడే శక్తియుక్తుల జీవన లతకు
నీలో పోరాడే ఆసక్తి ఉన్నంతవరకు బ్రతుకు
ముందు ముందు అన్యాయానికి ఉంటే నీటు
మందలించేందుకు మృత్యువు వేస్తుందిలే కాటు
మధురస్మరణతో జీవించేందుకు కావాలి నీ పాటు
మరణించాలనే ఆలోచన కారాదు అలవాటు
మానవత్వంలోని మహనీయత్వంను అహర్నిశం చాటు!!

# డాక్టర్

మీ కళ్ళు కురిపిస్తాయి అనంత ప్రేమ
మీ వాళ్ళు కానివారిగురించి మీకెందుకు శ్రమ
కుళ్ళును చెల్లా చెదురు చేయగోరి
కళ్ళు తెరవని పిల్లికూనల మాదిరి
మసలుతుంటే చేతుల్లోకి తీసుకొని
మా జీవితాలకు ఇకపై చీకటిరాని
అక్షరాలను చేదుకొని
అంతరంగంలో దాచుకొని
అధరంపై నర్తించే చిరునవ్వుల మూట
అనారోగ్యాలకు పరివర్తన నిచ్చే వరాల మూట
శీతలమై మనిషి మనిషిని పరామర్శిస్తూ
శిఖరమై మనసు మనసులో దర్శనమిస్తూ
శ్వాసలను స్పృశిస్తూ
శాశ్వత ఆశలను నెరవేరుస్తూ
రోగము ఇకపై మీకెందుకు
అనురాగమై దూకాలి ముమ్ముందుకు
అంటూ బాధను చల్లార్చే డాక్టర్
ఇంటింటా ఓదార్పునిచ్చే ప్రొజెక్టర్
నీలో ప్రవహించేది కాదు అవినీతి
నీలో ప్రవేశించేది సర్వమానవ సమతాభావం
పేషెంట్‌ని చిక్కించుకుంటే యమధర్మరాజు
ప్రెసెంట్ అనిపించేందుకు మారాలి సర్జరీ నటరాజు
ఇంత అవుతుందని అడిగిన ఫీజు
అంతరంగంలో ఏమి అనిపించదు ఈరోజు
ఇంటింటి గాథలను ఓదార్చు
కంటి కంటి బాధలను చల్లార్చు
కూలిపోరాదు రాలిపోరాదు ఎవరి కాపురం
డాక్టర్.......................................
కలియుగ రోగాల పాలిటి మీరు గోపురం!

# ఐకమత్యం

పారుతున్న సెలయేరు
మారు పేరుగా నెత్తురు
మనిషికి ఇలలో ఇక సెలవు
ముసురుకుంటె మృత్యువు
ఎటుచూసినా కత్తులు బాంబులు
వెర్రికేకల కాళిక రూపాలు
ఆకారాలనే వికారంగా చేసే కృత్యాలు
అభాగ్యుల జీవితాలతో నృత్యాలు
ఉంటే కులమత భేదాలు
కంటిలోన కదలాలి వేదాలు
కారాదు మనవి పాలి కుటుంబాల కుట్రలు
కావాలి మనలో ఐకమత్య భావాలు
బాష్పాలే అవుతే భాగ్యం
బాగుపడేందుకేది ఆరోగ్యం
భాషలు, వేషాలు కావు ముఖ్యం
భాసిల్లాలి అందరి సౌఖ్యం
మనసులో కుల మత ప్రేత
మాసి పెనవెయ్యాలి మమత
మనుషులంతా ఒకే జత
మన అందరికి ఉంటుంది భారతమాత చేయూత.

# యుద్ధభయం

చావంటే భయమెందుకు?
చావడమంటే బాధెందుకు?
బ్రతుకును దాయడమెందుకు?
ఈ లోకం కారాదు రంగస్థలం
ఇది రణరంగస్థలం అయినప్పుడు
యుద్ధభయం
ముసురుకుంటే కసురుకున్నా

విసుగుతో విసురుతున్నా
అవుతుందా దూరం
ఆయుధాలనే చేస్తావేమిటి బేరం
ఈ భూమికి మానవులయ్యారా భారం
రక్తధారలను చూడలేని ఘోరం
సృష్టిస్తున్న వారిదే నేరం
ఈ దృశ్యం........
నీ దృష్టికి రాదా హే రాం !!

# కనువిప్పు

పరులను అస్తమానం
అవమానిస్తూ, అనుమానిస్తూ
అపార్థం చేసుకొంటుంటే
నీది బుర్రే కాదు
సర్ది చెప్పడానికి నాకు వెర్రి లేదు
పచ్చకామెర్ల కళ్ళతో
విర్రవీగే మనిషి
పరిసరాల్లో నీకంతా
పచ్చగానే కనబడుతూ
పిచ్చెక్కేటట్టుంది నీకు
విధవపై అపవాదులను సృష్టిస్తే
వెధవవు నీవే అవుతావు నా దృష్టిలో
ఆ ఆక్రందన ఆ ఆర్తనాదం
నిజం నిరూపించమంటూ నిన్ను బంధిస్తుంది
పాము పడగలోని
పగ నీడన నిద్రిస్తున్న
నీ కళ్ళకు కనువిప్పు
కలిగే దెప్పుడు?
నీలోని మానవత్వం
వెలిగే దింకెప్పుడు?

యం. మహాంతయ్య

# మిత్రసందేశం

ఓ మిత్రమా!
కరువులో ఎరువుల్లేక ఎండిపోయిన పైరులా
బక్కచిక్కిన బరువైన గుండెల్తో
కనీసం వర్షం కోసం రోదిస్తున్న
ప్రజల కన్నీటి పన్నీరు సిద్దెను
భుజానికి వేసుకొని
యువభారతిలోకి అడుగుపెట్టు
పరోపకారానికి నడుంకట్టు.

వెఱ్ఱితలలు వేస్తున్న టెఱ్ఱరిస్టుల
ఆగడాలను అంతంచేసి
వారిని మంచి మనుషులుగా మార్చేందుకు
ప్రేమయనే గొడుగును చేతబట్టి
యువభారతిలోకి అడుగుపెట్టు,
మంచితనాన్ని అందరికి పంచిపెట్టు.

అంటరానితనం, లంచం, వరకట్నాలనే
కంటకాలను అణిచేందుకు
నిరాటంకంగా, నిర్భయంగా
అహింసా మానవతలనే
పాదరక్షల్ని వేసుకుని
యువభారతిలోకి అడుగుపెట్టు
అన్యాయాల్ని తరిమికొట్టు.

ఈ నా మిత్ర సందేశాన్ని ఆనందంగా స్వీకరించు
సాహసంతో సమాజాన్ని జాగృతపరచు
అందుకే యువభారతిలోకి అడుగుపెట్టు
జాతి సమైక్యతకు శ్రీకారం చుట్టు.

## ఏది మిన్న?

మానవుల్లో మతాలు ఎన్ని ఉన్నా
స్త్రీ పురుషజాతులు రెండే మిన్న
భగవంతునికి పేర్లు ఎన్ని ఉన్నా
మాధవుడు మాత్రం ఒక్కడే కనుగొన్న.
లోభిచేసే వాగ్దానాలు ఎన్ని విన్నా
పేదవాని కడుపు నిండునా ఎపుడన్న.
వరకట్న దురాచారం ఎంతవరకున్నా
అతివలకు తప్పవు అగచాట్లన్న.
అంటరానితనాన్ని అంతం చేయకున్న
ఐక్యత ఉండునా అందరిలో ఎపుడన్న.
మనిషి మంచిని పెంచుకోకున్న
ఈ దేశం అభివృద్ధి సాధించడం సున్న.
ప్రతి మానవుడు ఒట్టిమాటలు చెప్పడంకన్నా
సమాజానికి కొంతైనా గట్టిమేలు చేయడం మిన్న.

## అంటరానివాళ్ళు

అమాయకులను అంటరానివాళ్ళనుట
తుంటరివాళ్ళ వాదన
అది జాతిని మంట కలుపునని
నా ఆవేదన.
అంతటా అంటరానివాళ్ళున్నారంటే కాదన
మరి ఆ అంటరానివాళ్ళెవరా అని నా సాధన.
మానవ విలువల్ని స్వార్థానికి ఆహుతిచేసి
చీడపురుగుల్లా చీటికి మాటికి
లంచానికి మంచం వేసేవాళ్ళు
అంటరానివాళ్ళు.
వనితల్ని వరకట్నంతో వంచించి
అనుదినం అత్యాచారాలు చేస్తూ
ఆత్మహత్యలకు కారకులయ్యేవాళ్ళు
అంటరాని వాళ్ళు
క్షణాని కొక పార్టీ మార్చి

సలక్షణంగా లక్షలు కూర్చి
లక్ష్యమేదో విస్మరించి
అక్షరాలలోనే (వి) నాయకులైనవాళ్ళు
అంటరానివాళ్ళు.
బాల్యవివాహాల్ని బలవంతంగా చేసి
అంతులేని సంతానంతో
ఆనందాన్ని అంతం చేస్తూ
దేశపరిస్థితిని క్లిష్టము చేసేవాళ్ళు
అంటరానివాళ్ళు.
ఈ అంటరాని వాళ్ళెంతకాలమున్నా
దేశం అభివృద్ధి సాధించడం సున్నా
అందుకే
అమాయకులను అంటరానివాళ్ళనుట
తుంటరివాళ్ళ వాదన
అది జాతిని మంటకలుపునని
నా ఆవేదన.

# రాష్ట్రావతరణం

నవంబరులో రాష్ట్రావతరణోత్సవం
కడుముచ్చటైన ఆనందోత్సవం
నవంబరుకో ఉత్సవం
పెరుగుతూనే ఉంది ప్రతి సంవత్సరం
రేపటికోసం కలలుకంటూ
నిరీక్షిస్తున్నాం దినం దినం
మార్పుకోసం ఎదురుచూస్తూ
జీవిస్తున్నాం క్షణం క్షణం
పేద ధనిక వ్యత్యాసాలతో
కులమత విద్వేషాలతో
సాటిమనిషిని సజీవసమాధి చేస్తూ
దోచుకొని దాచుకునే దుష్టనీతితో
విహరించే దురాత్ములున్నంత కాలం
ఇది నిజమైన ఉత్సవం కానేకాదు
నవంబరుకు సంబరం రానేరాదు

వరకట్న దురాచారాలు
అశాంతి, హాహాకారాలు
స్వార్థపిశాచి అట్టహాసాలు
అవినీతి విన్యాసాలు
మంచిని మటుమాయం చేసే
వంచనకు రాజభోగాలు
ఈ పైశాచిక కృత్యాలు మాసిపోనంతకాలం
ఇది నిజమైన ఉత్సవం కానేకాదు
నవంబరుకు సంబరం రానేరాదు
విదేశ నాగరికత విన్యాసాలతో
విదేశ భాషా వ్యామోహంలో
విజ్ఞానులుగా చలామణి అవుతున్న
అజ్ఞానులు ఉన్నంతకాలం
ఇది నిజమైన ఉత్సవం కానేకాదు
నవంబరుకు సంబరం రానేరాదు
అందుకే ఓ నేస్తమా!
ఈ సమాజాన్ని సంస్కరించుటకు
సచ్ఛీలాన్ని అస్త్రంగా స్వీకరించు
దుర్మతుల నెదిరించి దుందుభి మ్రోగించు
దురాచారాలను రూపుమాపు
మనసులో అనురాగం పెంచు
అవినీతిపరుల ఆటకట్టించు
కనులలో కారుణ్యం కరిగించు
అప్పుడే మానవ జీవితంలో
వసంతం వెల్లివిరియు
ప్రతి నవంబరులో
సంబరం పొంగి పొరలు
అమ్మా! తెలుగుతల్లీ!
ఈనాడు నీ పుట్టిన రోజున
పెట్టడానికేమున్నది?
అధికధరల కడలిలో
కరువు కాటకాల్లో మునిగినవాణ్ణి
అందులోనూ వాయిదాపడిన కరువుభత్యాలు

సకాలానికి రాక సతమతమౌతున్న వాణ్ణి
ఈ నా కవితే నీకు నైవేద్యం.

## స్వాతంత్ర్యమా! నీవెక్కడ?

స్వాతంత్ర్యమా? ఎక్కడ? నీవెక్కడ?
చింపిరితలలు చింకిపాతలతో నున్న
బక్కచిక్కిన దీనుల బడిపిల్లల్లోనా!
అప్పులబాధకు తాళలేక ఆత్మహత్యలనే
శరణువేడిన అన్నదాతల్లోనా!
నిరాశా నిస్పృహలతో నూతులు, గోతులు
వెదుక్కుంటున్న నిరుద్యోగుల్లోనా!
స్వాతంత్రమా! ఎక్కడ? నీవెక్కడ.

వరకట్న దురాచారానికి తాళలేక
ప్రాణాలనే బలిగొంటున్న యువతులలోనా?
కూడు, గూడు, గుడ్డలేక రోడ్ల ప్రక్కన
అరగడుపులు, వరగడుపుల బడుగులలోనా?
కుల, మత, కలహాల కురుక్షేత్రంలోనా
మంచీ, మానవత్వం మాడి మసి అవుతుంటే
సరిసమాన మెక్కడ? సహజీవన మెక్కడ?

కరచరణాల్ని కలుపుకొని నడవ వలసిన దేహం
అంతరంగ కల్లోలంతో అడుగు ముందుకు సాగకపోతే
మనిషెక్కడ? మమతెక్కడ?
జాతిసారము నీరసించి అతిసారం ఆవరించి
పెరిగి పెరిగి పెద్దవయితే
తను వెక్కడ? మన మెక్కడ? మనిషెక్కడ?
స్వాతంత్ర్యమా? నీవెక్కడ? ఎక్కడ?

అందుకే ఓ స్వాతంత్ర్యమా!
నరుడు నిన్ను సద్వినియోగం చేసికొన్నప్పుడు
సన్నజాజి తీగలా సాగిపోతుంది జీవితం
సంపెంగపూవులా సురభిళమవుతుంది భావితం
పూలతేనెసొనలా తీపితో నిండుతుంది చరితం
పండువెన్నెలలా నా కల నిండుగా పండుతుంది నిరంతరం.

## కానుక

నీ మాటల్లోని మత్తు
నీ కన్నుల్లోని నిషా
నా పలుకుల్లోని నిండుతనం
చిత్తుగా దోచుకున్నా రెవరో........
నిర్దయగా దొంగిలించారు
నిస్సహాయుల్ని చేసి వెళ్ళారు
వెళుతూ వెళుతూ -
భీతిని మనకు కానుకగా ఇచ్చి వెళ్ళారు ........
ఇప్పుడు -
మనం మాట్లాడే ప్రతి మాటనీ
ఎవరో పొంచి వింటున్నారనే భయం
మనం వేసే ప్రతి అడుగునీ
ఎవరో పొంచి చూస్తున్నారనే భయం
భయంతో బ్రతుకలేను
మచ్చ లేని స్వేచ్ఛ కావాలి నాకు
మళ్ళీ నేను చూడాలి
నీ మాటల్లో మత్తు
నీ కన్నుల్లో నిషా

## ఫార్ములా

అన్వేషిస్తున్నాను........
దేనికొరకో, ఎందుకోసమో తెలీని నిరంతరాన్వేషణ
గమ్యం లేని ఈ అన్వేషణకు అంతమెప్పుడో!
వెదకి వెదకి వేసారిపోయాను
అబ్బ! ఏమీ దొరకదే....—
ఎంత కాలమీ వెతుకులాట?

అరె! ఏమిటిది? నా కాలిని పెనవేసుకుంటూంది....
ఏదో తీగ-
బంధించడం తీగ నైజం కదూ!
బందీని కాలేను నేను
బంధవిముక్తుణ్ణి కావాలి నేను
ఇపుడిపుడే స్ఫురిస్తోంది....
బంధవిముక్తుణ్ణి చేసే
ఫార్ములా కోసమే కాబోలు నా అన్వేషణ!

## పాణిగ్రహణమా! నీకు వీడ్కోలు!!

అదె! చెబుతూంటే వినిపించుకోవేం?
రాళ్ళూ, రప్పలూ, ముళ్ళ పొదలూ....కనబట్టంలా?
కంటకమయమైన దారిని వయనిస్తూ
ఈ శిఖరాగ్రం చేరుకోడానికి
అంత ఆరాటం దేనికి?
మామూలు వేగమా - మనోవేగం నీది!
చిటికెలో చేరువయ్యావు
చెయ్యి జాపి చెయ్యందించ మంటున్నావా?
వద్దు నేస్తం! నా మాట విను—
నా మలిన హస్తాన్ని నీ కందించి
నీ సుగంధభరిత హస్తాలకు
మాలిన్యాన్ని పులమలేను
పద....నెమ్మదిగా దిగు
క్రిందివరకూ తోడొస్తా....

## రాంగ్ నంబర్

నిజంగా ఎన్ని గుండెలు నీకు ?!
నే నతి ప్రయాసపడి నిర్మించుకున్న
దుర్భేద్యమైన కోటగోడను
ఛేదించుకొని వచ్చిన నీ కెంత ధైర్యం?!
ఆ ధైర్యమే కాబోలు నన్ను ముగ్ధుడ్ని చేస్తున్నది!

కానీ ఏం లాభం ?
నీ భ్రమ గాని - ఇక్కడేముందని ?
అసలెక్కడైనా ఏముంటుంది గనుక!
ఏది ఏమైనా
తియ్యని బాధను అనుభవంలోకి తెప్పించావు నాకు
చేదు సుఖాన్ని కూడా చవి చూపించు నేస్తం.......
మధురస్మృతులు చాలు మలిగిపోవు బ్రతుక్కి-
ఇక్కడినుంచి త్వరితంగా పారి పో!
మాట........
కోటగోడను పునర్నిర్మించుకునే శక్తి లేదిప్పుడు నాకు
నిర్దాక్షిణ్యంగా దోచుకున్నా రెవరో........
నీవే నిర్మించి మరీ వెళ్ళు
నాదో రాంగ్ నంబర్!

తా. క. :- నేస్తం! లేకుంటే ఓ పని చేయి....
నిన్నాకర్షించిన కోటగోడను
సమూలంగా ధ్వంసం చేసి వెళ్ళు
మరెవ్వరూ ఆకర్షింపబడకుండా
పుణ్యం కట్టుకో!

# స్వేచ్ఛాభిక్ష

నా లోకంలో —
నిస్సారంలోంచి సారాన్ని
నిర్జీవంలోంచి జీవాన్ని
సౌందర్య రాహిత్యంలో సౌందర్యాన్ని
తమస్సులో తేజస్సును దర్శించుకునే
నన్ను
కళ్ళెం వేసి, నీ లోకానికి లాక్కెళ్ళి —

నీ అతిలోక సౌందర్యాన్ని. తేజస్సును
అనుభవించాలని ఆశ పడక
కేవలం
పొగడాలని ఉబలాటపడితే —
నా నోటికి గొళ్ళెం పెట్టి
తాళం వేస్తావెందుకు నేస్తం ?........
నా లోకానికి పారిపోనీ నన్ను
స్వేచ్ఛాభిక్ష ప్రసాదించు నాకు.

# వైద్యం నేర్పించు

అసలు నేను వైద్యుణ్ణికానని ఎంత వారిస్తున్నా
వినకుండా నా ప్రాంగణంలో అడుగు పెట్టావు
సరే....
వైద్యునికి చూపిద్దామంటే జబ్బేమిటో చెప్పకుండా
కుమిలి కుమిలి విలపిస్తావెందుకు నేస్తం?
నీ కన్నులు కాయలు కాస్తే
చూడగలనని ఎందు కనిపిస్తుంది నీకు?
నీ శోకాన్ని భరించే శక్తి నా కెక్కడుందని?
(వైద్యం నేనే చేయాలి కాబోలు!
ఇప్పుడు ఈ వయసులో వైద్యం నేర్వాలి కాబోలు!!)
సరే....
నీవు చెప్పకనే నీ జబ్బు తెలుసుకునే శక్తి
నీవే ప్రసాదించు
నీవే నేర్పించు వైద్యం.

సి. కామేశ్వరరావు

# విషాదంలో విరులు

చల్లని వెన్నెల కరస్పర్శకు
కిలకిల గలగల నవ్వులు రువ్విన
ఈ లేత ప్రసూన అనురాగ వదనాల్లో
ప్రశాంతత మచ్చుకైనా లేదు
సుగంధ పరిమళాలతో
ఉయ్యాలలూగి తూగి
పరవశించిన బాల్యవనంలో
వెలుగు రవ్వలు ప్రసరించటం లేదు
మకరంద మాధురీ ఝరీ భావాలతో
మాట్లాడిన పూల బాలలు
మూగవోయి మ్రగ్గిపోయి
రాగాలాపనకు దూరమయ్యాయి
లేలేత రెక్కల సవ్వడిలో
పుడమి తల్లి గుండెల్ని గుబాళించిన
కరుణార్ద్ర హృదయాలు
కళాహీనమై కరగిపోతున్నాయి
లలితమై గాలిలో తేలియాడిన
కలహ విదూరలీనాడు
కంట తడితో కలవరిస్తూ
ఒంటరితన మనుభవిస్తున్నాయి
ఎండకు అలసిన గుండెలపై
పండు వెన్నెల చిలికిన విరికూనలు
కారు చీకట్ల విషాదపు కౌగిట్లో
ఒదిగి పొదిగి విలపిస్తున్నాయి
వసంత పవనాలు శరీరాన్ని తాకితే
పులకించి తలలూచిన మరులు

ఆర్ద్రతకూ రసార్ద్రతకూ దూరంగా
బ్రతుకంతా భారంగా మూల్గుతున్నాయి
శాంతికి సహజీవనానికి
కాంతి రేఖలు తొడిగిన విరులు
దానవత్వపు దండయాత్రకు
తల్లడిల్లిపోతున్నాయి
మునిముసి నవ్వుల ముద్రతో
రాగమిళిత పాల బుగ్గల మొగ్గలు
తుచ్ఛభావ కాలుష్యంలో యిరుక్కొని
స్వచ్ఛతా నిగ్గులు కోల్పోతున్నాయి
సమ సమాజపు పూదోటలో
వాడిపోతున్న విరుల జీవితాల్లో
ఆనందపు సిరిజల్లులు కురవాలి!
నవజీవన నందనవనం మురవాలి!!

# పరిభ్రమణం

నీ నడకే నీకు తోడునీడగా
నీ నీడే నీకు వెన్నెలవాడగా
అతుకుల బ్రతుకుల మధ్య
గతుకుల రోడ్డుమీద
నడుస్తుంటావు నీవు
కాలం ప్రహరీగోడల లోపల
ఆశయాల పూలమొక్కలు
ఆలోచనల పూలు పూస్తూనే వుంటాయి
నడుస్తున్న మార్గం
నాగరికత ముసుగులో
నగ్నత్వం ప్రదర్శిస్తూ
వెర్రినాల్కలు చాస్తూనే వుంటుంది

పట్టపగలు నట్టనడిరోడ్డు మీద
మానవత్వం గుండెల్లో
దానవత్వ కరవాలం దూసుకుపోతుంది
తలమీద మెరిసిన ఆకాశం
మబ్బుల మౌనగీతం పాడుతూ
మమతకూ సమతకూ ఎదురుచూస్తుంది
ఆర్ద్రితతో తడిసిన అనాథ కన్ను గవ
అమాయకంగా నీ ముఖంలోకి చూస్తుంది
నీ గుండెలో జాలి గుబులుమంటుంది
జేబునుండి చేయి ఖాళీగా తిరిగొస్తుంది
ఆకాశపుటంచుల్లో
ఆనందంతో కేరింతలు కొడుతున్న
ఏ పక్షి నీ గుండెగూటిలో కాపురం చేయదు
ఏ చందన తరుచ్ఛాయా
ఎండిన నీ తలకు గొడుగుపట్టదు
మనసు వ్యాకుల సముద్రమై
కల్లోల కెరటాలతో ఎగసిపడుతుంది
పాల వెన్నెల నురుగుల శోభ
నీ కంటికి కనిపించదు
చిగురుటాకుల జొంపాలపాట
నీ వీనులకు వినిపించదు
అంగడిలోని నిత్యావసర వస్తువులు
నీ చేతి కందని తారకలు
నీవేమో నిత్యసత్యంగా
సూర్యుని చుట్టూ తిరుగుతున్న భూమిలా
జీవితం చుట్టూ పరిభ్రమిస్తుంటావు.

# చైతన్యసుధ

నితాంత జీవన వారాశిలో
చైతన్య తరంగ స్వరమై
హృదయ వీణాతంత్రుల్ని మీటుతూ-
అజ్ఞాన తిమిర సమరాంగణంలో
కాంతిచ్ఛటల జ్ఞాన జ్యోతియై
స్నిగ్ధ తేజోరూపాన్ని ప్రతిబింబిస్తూ-
శిథిల దేహం గాయాలలో
సందేశ గేయాల సమాహారమై
మహిమాన్విత శక్తి ప్రదర్శిస్తూ-
కుటిల గుణ దుర్గంధ ధూమంలో
పరిమళ పవన కవనమై
మరంద వాణీనాదం వినిపిస్తూ-
మానవ సంస్కరణోద్యమంలో
మనోహర భావ ప్రకాశమై
అపూర్వ యశోకాంతుల్ని ప్రసరిస్తూ-
శిశిర హృదయ కుహరనాళంలో
వసంత విలసిత పత్రహరితమై
విశ్వవిజయ కేతనం ఎగరేస్తూ-
మసకబారిన ఎడారి నిశ్శబ్ద స్తబ్దతలో
వెలుగు కిరణ శబ్ద దృశ్యాచరణమై
అకుంఠిత కార్యదక్షతను ప్రసాదిస్తూ-
విషపూరిత కాలసర్ప వలయంలో
మధుర మోహన వేణుగానమై
యుగాంతాల గుండెల్లో మారుమ్రోగుతూ-
వికీర్ణ ఎదల కథల మథనంలో
నిరంతర నిర్నిద్ర తేజోనిధియై
అచంచల ఆత్మవిశ్వాసాన్ని కలిగిస్తూ
నాలో అక్షర చైతన్య సుధ-!

# దిగులు

విశ్వమానవ ముఖపద్మాలలో
పరిమళించే మానవతాలాస్యం
మతం మంచుతెరల పొరలలో
ఆనవాలు లేకుండా అణగారిపోతుంది!
నితాంత నిబిడాంధకారపుటెడారిలో
ఒంటరి ఒంటెలా జీవితం
ఇసుక తిన్నెల అలల మధ్య
విరామంలేని ప్రయాణం చేస్తుంది!
గాలి వినిపించిన గంధర్వగానం
మరణమృదంగధ్వనిలా కంపిస్తూ
వర్తమాన నర్తనశాలలో
వికృతి నాట్యవిన్యాసం ప్రదర్శిస్తుంది!
సంస్కారం రంగరించుకొని
నమస్కారంచేసే చేతులు
పరాజయం పరిష్వంగంలో
పరితపిస్తూ కన్నీరు కారుస్తున్నాయి!
వాడిలో వాదిగిన మమకారం
సురిగి సురిగి కళ్ళు తిరిగి
నవ్వుల స్పర్శలేక
నిలువెల్లా చల్లబడిపోతుంది!
ఆలోచనాలోచనాల్లో
విషాద బాష్పమేఘాలు ముసిరి
అవ్యక్తవేదనా గర్జనలతో
అనుభూతికలల్ని హరిస్తున్నాయి!
అందుకే....ప్రతిదినం
ఉదయిస్తున్న ఉదయంతో
హృదయం విప్పి మాట్లాడాలనుకుంటే
ఎదలో గుబులు ఎడతెగని దిగులు!!

బత్తిని విఠల్

# మానవతా—నీ అడ్రసు ఎక్కడ?

తరతరాల
సౌభ్రాతృత్వానికి
పరమత సహనానికి
మారు పేరు
మన భాగ్యనగరము.
మరి నేడు మనము చూస్తున్నదేమిటి?
వినుచున్న దేమిటి?
వర్తమాన మేమిటి?
గణేశ నిమజ్జనోత్సవంలో
కరకత్తుల స్వైర విహారం
రక్త తర్పణం
అమాయకుల బలి.
ఏమైంది నాటి
తానీషా, అక్కన్న మాదన్నగారల
మైత్రీ యంత్రాంగం?
గోలకొండ ఖిల్లాలోనే,
కూలిన ఖిల్లా గోడల్లోనే,
సమాధి అయిందా? లేక
మూసీనది గుండా
సాగరయానం చేసిందా?
అవేవీ కాదనుకుంటే
నేటి ఊసరవెల్లి లాంటి
కుటిల రాజకీయాల మూలంగా
విజృంభించిన
మహమ్మారిలాంటి

మత పిశాచి యొక్క
పాషాణ పూరితమైన
రక్కసికోరలకు
బలౌతున్నదా?
ఏమైంది మనుషుల్లోని
మానవత్వం, మత సహనం?
మసీదుల్లోను, గుళ్ళల్లోను
రెండింటిలోను పేర్చింది రాళ్ళే.
ఆ రాళ్ళెత్తింది
గోడల పునాదులు వేసింది
బక్క చిక్కిన
డొక్కలు ఎండిన
బడుగు వర్గాల కూలీలే,
అందరిలోను
అరుణారుణమైన
రుధిరమే
రుధిర ప్రవాహమే
అయినా
మనిషి, మనిషిలో తేడా!
కట్టు బొట్టు, జుట్టూ
ఆచార వ్యవహారాలు
వేరైనంత మాత్రాన
రామ్, రహీమ్
రత్తి, ఫాతిమా
యాకుబ్, జాకోబ్
రానున్న మొహరంలో
వంతుల వారీగా
చిందులు వెయ్యరా
"ఈద్ ముబార్క్" చెప్పుకోరా?

అందుకే
నా కనుమాన మొస్తుంది
మనుషుల్లో మానవతే కరువైందా?
లేక మానవతకు
మరో అర్థం చెప్పుకోవాలా? లేక
క్రొత్త అద్రసు వెతుక్కోవాలా?
అందుకే
నేనంటాను
మనిషి, మనిషిని
వేరుచేసి
మానవతను
మంటకలిపి
దానవత్వానికి
దారులు చూపే
మతోన్మాద వ్యవస్థ మన కొద్దని
మానవులంతా ఒక్కటే నని
చాటిచేప్పే
సమసమాజం కావాలని.

# వెళ్ళిపో నేస్తం వెళ్ళిపో!

నేస్తం!
మళ్ళీ మధ్య తరగతి కుటుంబంలో పుట్టావా?
అయ్యో! వెర్రి నేస్తం!
అపుడే మరచిపోయావా?
గత జన్మ జ్ఞాపకాలు
ఏవి? నీకు గుర్తుకు రాలేదా నేస్తం?

అవే నేస్తం-
N. G. O. అయిన నాన్న తెస్తున్న
చాలీ చాలని జీతంతో
అందరికీ ముప్పూటలా సరిపడా
వడ్డించలేక అమ్మ పడిన అవస్థలు
ప్రాయ మొచ్చిన పరువాలను
దాచుకోవడానికి
అక్క చెల్లెళ్ళకు సరియైన
ఓణీ పరికిణీలు కొనలేక
ఇరుగమ్మల, పొరుగమ్మల
సూటి పోటు మాటలు
శూలాల్లా గుండెల్లో గ్రుచ్చు కుంటుంటే
వంట గదిలో ఒక్కర్తి
వెక్కి వెక్కి ఏడుస్తున్న
అమ్మ కన్నీళ్ళ రోదన
నీకు జ్ఞాపకం రాలేదా నేస్తం!
ఐదు పైసలు ఇడ్లీ
అర్ధ రూపాయి అయింది
అర్ధరూపాయి ప్లేటు భోజనం
అయిదు రూపాయలయింది
పావలా ఎక్సర్ సైజు పుస్తకం
రూపాయి పావలా అయింది
ఆరు రూపాయల స్కూలు అడ్మిషన్ ఫీజు
అరవై రూపాయలైందని
వంద రూపాయల బైసికిలు
ఆరొందలు అయిందని
ఆరణాలు అంగీకూలి
పదహారు రూపాయలు అయిందని
ఇలా ఇలా ప్రతి వస్తువు

పదింతలు పెరిగి పోయిందని
నీకు తెలియదా నేస్తం!

అయినా
ఏం సుఖపడుదామని
ఎవరి నుద్ధరిద్దామని
మళ్ళీ మధ్యతరగతిలో
జన్మించావు నేస్తం?
వద్దు, వద్దు నేస్తం!
ఇప్పటికే నడ్డి విరిగిన
ఆ సగటు తల్లి తండ్రుల
బ్రతుకు బండిపై
ఇంకా నీ భారం మోపకు
నేస్తం, వెళ్ళిపో, వెళ్ళిపో
మనుషుల్లేని మరో ప్రపంచంలోకి
వెళ్ళిపో, నేస్తం, వెళ్ళిపో!!

## సామాన్యుడి సణుగుడు

పాత ప్రభుత్వం పడిపోయి
కొత్త ప్రభుత్వం వచ్చిందన్నారు.
అసెంబ్లీ ఆరంభం
పార్లమెంటు ప్రారంభం
బడ్జెటు సెషన్సులో
ప్రజాప్రతినిదుల
కీచులాటలు
దూషణ భాషణాల మధ్య
మహిళా సభ్యురాళ్ళ
మానాభిమానాలపై
మాయని మచ్చలు.
ఎలాగైతేనేమి?

పద్దుల కేటాయింపు పూర్తి అయింది
దాని ప్రభావమే
పాత ప్రభుత్వ ప్రణాళికల
రద్దుల రాద్ధాంతం
కొత్త ప్రభుత్వం
పన్నుల పోటు
ఫలితంగా
చక్కెర క్యూ
కిరసనాయిలు క్యూ
తిండి గింజలు క్యూ
(ఆటా బియ్యం క్యూ)
పామోలిన్ క్యూ
పాఠ్యపుస్తకాలు క్యూ
పెట్రోలు, డీజిలు క్యూ
కుడి ఎడమల క్యూ
క్యూలో నిల్చుకోలేక
బ్లాకుమార్కెట్టుకు
పరువులెట్టితే
ధరలు అందలమెక్కాయి
చివరకూ
కిరసనాయిల్లో నీళ్ళ కల్తీ!
దీనికి పరిష్కార మెప్పుడో?

డా॥ వి. సంపత్కుమారాచార్య

# మంగళ నమస్కారము

బుద్ధునకు నమస్కారము కరుణామయు డాతడు
దుఃఖనివారకమార్గమిచ్చెను సంసారమునకు సుఖాలనిచ్చెను॥
సమస్త అరిహంతులకు నమస్కారము సమస్త సత్పురుషులకు నమస్కారము
జననీ జనులకు నమస్కారము వారి ఉపకారమే ఆనందము॥
గురుదేవునకు నమస్కారము సత్పురుషమహాత్ముడతడు।
కరుణాచిత్తముతో నతడు దాన ధర్మమొనర్చె నతడు॥
ఆసయామాజీకి నమస్కారము మాయామమతలను చూపెను।
హృదయ కోమలతతో మనోనిర్మలము, మరుపురానిది ఎన్నటికి॥
సద్గురు సాంగత్యము లభ్యమైనది, సత్యసారము లభించినది।
జీవితమును సఫలమొనరించితిని, శిరోభారమును దించుకొంటిని॥
మార్గము మరిచి దిగ్భ్రమచెందితి, హృదయము వ్యాకులత చెందినది।
గురుదేవులకు ధన్యవాదములు, సత్పథదర్శకులైనారు॥
గురుదేవులకు ధన్యవాదములు, ఆసయామాజీకి ధన్యవాదములు।
ధర్మరత్నమును ప్రసాదించినారు పాప మిక సమీపించకుండును॥
ధర్మరసమును రుచి చూపించినారు, విషయవాసనలు మాయమైనవి।
ధర్మ సారము అనుగ్రహించినారు, పైపొట్టులను తొలగించినారు॥
సబల ధర్మమును మనకిచ్చినారు అడుగడుగున మనకు సహకరించినారు।
భయంకర భయము తొలగినది, నిర్భయులుగా నొనరించినారు॥
రోమరోమము నవ్యత గల్గినది ఋణముక్తము నిక కావలెను।
ధర్మజీవనము జీవించవలెను ఇదియే యొకసద్యోపాయము॥

# మంగళ గీతము

మనసు నీకు అద్దము కావాలి।
మంచి చెడ్డలని చూడాలి, చూపించాలి॥ మనసు నీకు అద్దము కావాలి॥
సుఖములను పుష్పములు। కష్టములను కంటకములు
మనసే అన్నిటికీ మూలము,

మనసులో వెలుగు ఎప్పుడెప్పుడు గల్గునో।
అప్పుడప్పుడే జగత్తులో వెలుగు గల్గును॥
ఈ వెలుగు అద్దముపై దుమ్ముధూళి రాకుండాలి।
మనసే నీకు అద్దము కావాలి॥
మనసే దేవత, మనసే ఈశ్వరుడు
మనసుకంటె వేరే లేదు గొప్పదేది।
మనసుతో ఏ మాట దాగనీయకుము॥
మనసుకు నేత్రములనేకవేలున్నవి।
జగత్తునుండి ఎవరేని పారిపోగలరు
మనసునుండి పారిపోజాలరు
మనసుకు అద్దము కావాలి॥

# మంగళప్రభ

కాళరాత్రి గడిచినది, మేల్కొనుడు జనులారా!
మంగళమయ నవ వత్సరమునకు నవ ప్రభాతమొచ్చినది- 1
ధర్మ జ్ఞానము వినరండి, మానవత్వముగల మనుజుల్లారా
ఇందు గలదు సుఖము శాంతి, భక్తి మోక్షము లున్నవి 2
బోధిసత్వుని వాక్కు యిది, శుద్ధజ్ఞాన ద్యోతజ్యోతము
మంగళ మయము, అక్షర అక్షరముతో నిండినది 3
మధురవాక్కు ధర్మము, మాట మధురాతిమధురము,
అమృతరసముతో కూడినది కల్యాణమయము మంగళమయము 4
జగత్తు ప్రజలకు ధర్మ మార్గమును చూపుచుండు
సత్పురుషులు ఈ సత్పథమున నడుచుచుందురు 5
ధర్మము సదా మంగళకారి, ధర్మము కల్యాణకారి
ధర్మను సదా రక్షించును ధర్మమె మిక్కిలి బలయుతము 6
ధర్మ ధర్మమని చెప్పెడివా రెందరో - ధర్మ-అర్థము
తెలియ కుందురు
నిర్మల మనసుతోడి ఆచరణయే, శుద్ధ ధర్మముగా నుండును 7

ధర్మ మెన్నడు హిందూ, బౌద్ధము కాదు, సిక్కు, ముస్లిం
జైనులది కాదు

ధర్మమన చిత్తశుద్ధతయే, ధర్మమే శాంతిసుఖముల నిచ్చును 8

సంప్రదాయమును ధర్మముగా తలంచుట మూఢత్వమగు,
ధర్మసారమును పొందలేరుకాని, పై పొట్టును పట్టుకొన్నారు 9

మానవమాత్రులలో భేదభావము లేనంత వరకు,
శుద్ధ ధర్మము అందరికి మంగళప్రదము చేయును 10

ఇదియే ధర్మ నియమము, ఇదియే ధర్మపు రీతి,
ధర్మమును ధరించిన నిర్మలులు, పావనులు, పునీతులగుదురు 11

సంప్రదాయము, జాతి యను భేదభావముండకూడదు
శుద్ధధర్మము అందరిది, అది అందరికొరకున్నదియే 12

సంప్రదాయము ధర్మము కాదు, ధర్మము అడ్డుగోడ కారాదు
ధర్మము ఐక్యతను, ప్రియత్వమును నేర్పు నెల్లెడలను 13

సంప్రదాయ మద మెక్కినచో, ధర్మము తిరోగతి చెందును
తనకు అహితము నిచ్చును, జనులందరికి అనహితమగును 14

తనకు మేలు గలుగవలెను, జగమునకు మేలు గలుగవలెను
దానితో అందరికిని మేలుగల్గు అదియే శుద్ధధర్మమెల్లెడల 15

నాకు దుఃఖముండకూడదు జగత్తునకు దుఃఖము రాకూడదు
జీవితము జీవించుకళ - అదియే సత్యధర్మము 16

జాతి ప్రాంతము ధర్మముకాదు, ధర్మము అంటుముట్టులు కాదు.
ధర్మపథమున నడుచువారికి, సదామంగళము చేకూరును 17

శుద్ధ ధర్మము జగత్తున మేల్కొనాలి, విషమత దూరము కావాలి,
సమతా సుఖములు రావాలి, యోగక్షేమములు వ్యాపించాలి 18

ఇదియే ధర్మమునకు గీటురాయి, ధర్మమునకు సమీక్ష
జనులందరికి మంగళము చేయు సంతాపమును దూరము చేయు 19

ధర్మము మిథ్యాడంబరాలు కాదు, ధర్మము మిథ్యాచారము కాదు,
ధర్మము మిథ్యాకల్పనలు కాదు, ధర్మము సత్యసారము 20

శుద్ధధర్మము ఒకే ఒకటి - పై పొట్టులు అనేకములు,
పొట్టులో నిస్సారమున్నది, ధర్మసారమునే చూడుము 21

గుడ్డిభక్తి ధర్మముకాదు, గుడ్డినమ్మకము ధర్మముకాదు,
వివేకములేనిదే శ్రద్ధగల్గిన, ధర్మనాశము అది గల్గించు 22

సంప్రదాయమను విషము వనమంతయు నెడారి చేసెను,
ధర్మజ్ఞానము మేల్కొనుటలోనే జగమున వసంతము రాదొడగెను 23

ధర్మము కట్టుబొట్టులో లేదు, తులసి రుద్రాక్షమాలలో లేదు,
ధర్మము కమండలమున లేదు, ధర్మము మృగచర్మమున లేదు 24

ధర్మము గడ్డము మీసములలో లేదు, ధర్మముతలబోడులలో లేదు
పాపప్రవచనాలు మరి మోసపుటెత్తులతో పెచ్చు పెరుగు 25

సంప్రదాయమునుండి కడుదూరముగా దేశము ధర్మము కావలెను,
సుఖద శాంతిమయమై గణతంత్రము అవిచలము గావలెను 26

జటాజూటములు, మాలాతిలకములు ఇవియే తలకు భారములు
వేషము మారిన ఏమి గల్గునోయీ, మనసులోని మైల తొలగాలిగదా 27

గుణమును ధారణ చేయకయే నొసటితో నమనమనమొనర్చిన,
ధర్మరసము ప్రవహించి పోవును, మిగిలినది పగిలిన కుండయే 28

ధర్మము పేరుతో ఎన్నెన్ని భ్రష్టాచారములు చేసినారు
జనుల మనమున వ్యాకులత పెరిగి, వృద్ధిబొంది దుఃఖభారమైనది 29

మందిరములో, మసీదులో పొర్లినను భగవాను డెవరికి దొరికెను?
సేవాకరుణా, ప్రేమలతో స్వయం భగవానుడు కావలెను. 30

శుద్ధధర్మము జగత్తున మేల్కొనవలెను,
సంప్రదాయములనుండి దూరము కావలెను,
జనులందరికి కల్యాణపథము నిచ్చునిది
మంగళము చేకూర్చుటతో సంపూర్ణమగునిది. 31

ఎ. బసవయ్య

## శుభాశంస!

యువ భారతి రజతోత్సవ
కవితాకన్యకలు లాస్యకలనానిపుణల్
నవనవ భావస్ఫురణలు
దివిభువి సుషమావిభూతి తేజరిలునహో!

అభినవ యువభారతిలత
అభితశ్శుభసుకవితాలతాంత స్తబకాల్
ప్రభవింప జేసి ముదమున
సభాసదుల కింపునింపు సద్వాసనలన్.

సురభిళ శుభభావములన్
సరసములౌ కవిత లల్లి సహృదయులహృదిన్
పరమానందము నింపుచు
పరిఢవిలుత! భావిని యువభారతి జగతిన్.

ప్రతిభానిధులౌ సుకవులు
మతిమంతు లుపన్యసింప మాదురు లొలుకన్
మితహిత రసవద్వాఙ్ముఖ
మతులిత సన్నుతికి పాత్రమై రాణించున్.

'నందిని' యువభారతి ప్రియ
నందిని ప్రాజ్ఞజన హృదయనందిని రసని
ష్యందిని చిరమిహభువి నా
నందము నందించుగాత! నవరసధునియై.

డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం

## ఆంధ్ర జనతకు నవతకు (యువతకు) అంకితమ్ము

చిమ్మ చీకట్లను చీదరించుట కంటె
 చిరుదివ్వె వెలిగించు శిల్ప మెరిగి
సామాన్య జనులలో సాహిత్య చైతన్య
 సందీప్తి పోషించు సభలు తీర్చి
కమనీయ కావ్యాల కవితా కళా శిల్ప
 వైభవాల్ వివరించు ప్రభలు చిమ్మి
మానవ మూల్యాల మహనీయ సంస్కృతి
 నిర్మాణ శిక్షణ నీతి నెరపి

భారతీపాద మంజీర భవ్యరవము
తెలుగువారల గుండెలో వెలుగునట్లు
చెలగు యువభారతీ సంస్థ జీవితమ్ము
ఆంధ్ర జనతకు నవతకు అంకితమ్ము
ఆంధ్ర జనతకు యువతకు అంకితమ్ము.

—: o :—

# రజతోత్సవాలు జరుపుకుంటున్న 'యువభారతి' ఆశయాలు

- ☆ సమాజశ్రేయస్సుకు సమున్నత ప్రమాణాలు గల సాహిత్యం, ఉత్తమ విలువలను పెంచి పోషించగల సహృదయలోకం అవసరమని గుర్తించి, ఆ రెండింటినీ బలంగా పెంపొందించే సాహిత్య, సాంస్కృతిక, సామాజిక చైతన్యాన్ని కలిగించటానికి ఉద్యమించటం.
- ☆ సాహిత్యం ఎటువంటి సాహిత్యేతర శక్తుల అజమాయిషీకీ లోను కాకుండా, స్వతంత్ర వ్యక్తిత్వంతో సాత్వికశక్తిగా రూపొందాలనీ, అటువంటి సాహిత్యాన్ని సృష్టించే రచయితలు ఏ కాలం వారైనా, వారి కృషిని, సందేశాన్ని సామాన్య ప్రజానీకానికి అందేటట్లు వివిధ ప్రచురణల ద్వారా, కార్యక్రమాల ద్వారా యత్నించటం.... అంటే రాజకీయ కాలుష్యం లేని సాహిత్యోద్యమాన్ని సాగించటం.
- ☆ 'చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించటం మంచిది' - అనే లక్ష్యంతో సమాజంలో వ్యష్టిగా, సమష్టిగా శాంతియుత సహజీవనాన్నీ, ప్రజాస్వామ్యవిధానాన్నీ, నిర్మాణాత్మక కార్యశీలాన్నీ, మానవ విలువలతో కూడిన సేవాభావాన్నీ ఆచరించి చూపించటం.